దుష్ట శిక్షణకు
ఒక సాహసికి
రక్షగా నిలిచిన
ఒక తల్లి కథ!

చందమామ విజయా కంబైన్స్

# భైరవద్వీపం

బి.వెంకట్రామరెడ్డి - సింగీతం శ్రీనివాసరావు

# కాంప్కో వినోద ప్రపం






కాంప్కోతో ఉత్సవ వేడుకల ఉత్సాహం అందుకోం
కర్మాగారం ఉత్పత్తి చేసే స్వచ్ఛమైన చాక్లెట్ల
కాంప్కో — వినోద సమయా

















R K SWAMY/BBDO CL 12624 TEL

# ంలోకి వచ్చేయండి!



. ఇండియాలో అతిపెద్ద, అత్యంత అధునాతనమైన
లైన గొప్ప రుచి ఎలా ఉంటుందో కనుగొనండి.
పుట్టుకు వచ్చేది దీని నుంచే.




కేరింతల ఆనందం!






# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి



## చదువు 'బరువు'

వేసవి సెలవులు ముగిసి నూతన విద్యాసంవత్సరం ప్రారంభం కావడంతో–పాత మిత్రులను మళ్ళీ కలుసుకోవడం, కొత్త పుస్తకాలు, కొత్త పాఠాలు అంటూ పిల్లల మధ్య హడావుడి ఆరంభమవుతుంది.

పాఠ్యపుస్తకాలు అనగానే పిల్లలు మోయలేక మోసుకుపోయే పుస్తకాల సంచులే మనకు గుర్తుకు వస్తాయి. రోజురోజుకు పెరుగుతూన్న విజ్ఞానాన్ని పిల్లలకు అందించి, వాళ్ళను సమర్థులైన విద్యావంతులుగా తీర్చిదిద్దడం విద్యాలయాల ప్రధాన కర్తవ్యం. కాని, పిల్లలు దానిని ఎంతవరకు జీర్ణించుకుంటున్నారు? మునుముందు ఆ విద్య వాళ్ళకు ఎంతవరకు ఉపయోగకరంగా ఉంటుంది? అన్న విషయాలను దృష్టిలో ఉంచుకోవడం కూడా అవసరమే. పిల్లలు మోసే తలకు మించిన ఈ పుస్తకాల బరువు పట్ల కొందరు మేధావులు పార్లమెంటులో తీవ్రమైన నిరసన వ్యక్తం చేసిన విషయం కూడా ఇక్కడ గమనించతగ్గ విషయం!

ఈ విషయంగా వచ్చే ఫిర్యాదులను పరిశీలించి, తగిన సిఫార్సులు చేయడానికి కేంద్ర ప్రభుత్వం యశ్‌పాల్ కమిటీని ఏర్పాటు చేసింది. పుస్తకాల బరువు తగ్గించాలనీ, మరీ చిన్నతరగతులకు ఇంటర్వ్యూలు రద్దు చేయాలనీ, 'హోమ్‌వర్క్'ను క్రమబద్ధం చేయాలనీ యశ్‌పాల్ కమిటీ సిఫార్సు చేసింది. ఈ సిఫార్సులను కేంద్రీయ విద్యాలయాలు, నవోదయ పాఠశాలలు ఈ విద్యాసంవత్సరం నుంచే అమలు చేయడానికి నిర్ణయించినట్టు తెలుస్తున్నది. మరి, మిగతా విద్యాసంస్థల మాటేమిటి? ఇప్పుడు కనీసం ప్రాథమిక స్థాయి నుంచయినా ప్రారంభించడం శ్రేయస్కరం!



సంపుటి: 94 జూన్ '94 సంచిక: 6

విడిప్రతి : 4.00 సంవత్సర చందా : 48.00



# ఇది ప్రైమ్ విజయ రేఖ




ప్రవేశ పెట్టబడుతున్నాయి ప్రైమ్ జీనియస్, ప్రైమ్ మెరిట్. అత్యంత నాణ్యమైన కంపాస్ బాక్సులు. సంపూర్ణ నియంత్రణనిస్తూ, అతి నిర్దిష్టంగా, అతి సమర్థవంతంగా రేఖలు గీచేందుకై ప్రత్యేకించి తయారుచేయబడినవి. మీ చిన్నారికి ప్రైమ్ వాడే సదుపాయాన్నివ్వండి.

మీ చిన్నారికి అదెంతో అమూల్యమైనదని మీరే గుర్తిస్తారు.

**PIDILITE**

**PRIME GENIUS** **PRIME MERIT**

MATHEMATICAL DRAWING INSTRUMENTS

A PIDILITE PRODUCT

PID 8 94 TL

వార్తలు - విశేషాలు :

# దక్షిణ ఆఫ్రికాలో నవోదయం!



"దక్షిణ ఆఫ్రికా రిపబ్లిక్‌కు విశ్వసనీయంగా ఉండగలనని ప్రమాణం చేస్తున్నాను," అని చెప్పి నెల్సన్ మండేలా మే 10వ తేదీ ఆ దేశ అధ్యక్ష పదవిని చేపట్టాడు. అంతకు ముందురోజున జరిగిన నూతన పార్లమెంటు తొలి సమావేశంలో ఆయనను దేశాధ్యక్ష పదవికి ఏకగ్రీవంగా ఎన్నుకోవడం జరిగింది. ఆ విధంగా ఆయన దక్షిణ ఆఫ్రికాకు మొట్టమొదటి నల్లజాతి అధ్యక్షుడయ్యాడు.

దక్షిణాఫ్రికాలో లభ్యమయ్యే బంగారం, మరికొన్ని ఖనిజాల చేత ఆకర్షింపబడి, ఐరోపా దేశస్థులు అడుగు పెట్టడంతోనే, స్థానికులయిన నల్లజాతి ప్రజలను అణగదొక్కడం ప్రారంభించారు. 1652వ సం॥లో డచ్ ఈస్టిండియా కంపెనీ, కేప్‌టౌన్‌లో ప్రవేశించి, అక్కడి నుంచి తమ వలస ప్రాంతాన్ని లోపలికి విస్తరించుకుంటూ పోయింది. హిందూమహాసముద్రం, అరేబియా సముద్రం, అట్లాంటిక్ మహా సముద్రం గుండా వెళ్ళే ఓడలు, ఆఫ్రికా ఖండం దక్షిణాగ్రంలో వున్న 'కేప్ ఆఫ్ గుడ్ హోప్'ను చుట్టి వెళ్ళేవి. ఆ విధంగా అది ఆదాయానికి కేంద్రంగానూ, నౌకాయానానికి కీలకస్థానంగానూ రూపొందింది. ఈ కారణాల వల్ల మరొక వంద సంవత్సరాలలో బ్రిటన్ అక్కడ స్థానం సంపాయించింది.

అక్కడ చేరిన శ్వేతజాతి వాళ్ళు, స్థానికులయిన నల్లజాతి వాళ్ళను లోపలికి తరుమ గొట్టారు. నిర్దిష్ట ప్రాంతాలు దాటి రాకుండా కట్టడిచేశారు. వ్యాపార స్థలాలలో, ఆస్పత్రులలో, పాఠశాలలలో నల్లజాతి వారికి ప్రవేశం లేకుండా చేశారు. నల్లజాతి ప్రజలు తాము ఒకప్పుడు నివసించిన ప్రాంతాల మీద హక్కులను పూర్తిగా కోల్పోయారు. అల్పసంఖ్యాకులయిన శ్వేతజాతీయులు తమ ఆధిక్యతను నిలుపుకోవడానికి జాతివివక్షతా సిద్ధాంతాన్ని ప్రవేశ పెట్టి, అమలు చేశారు.

అలా జాతివివక్షతకు గురైన వాళ్ళలో మన భారతీయులు కూడా ఉన్నారు. వీళ్ళందరూ మన దేశంలోని గుజరాత్, మహారాష్ట్ర, దక్షిణాది రాష్ట్రాల నుంచి వెళ్ళి స్థిరపడిన వాళ్ళే. ఇంగ్లాండు నుంచి బారిష్టర్ డిగ్రీ పొందివున్నప్పటికీ, మోహన్‌దాస్ కరంచంద్ గాంధీని, నల్లజాతివాడు కావడంవల్ల దక్షిణాఫ్రికాలో మొదటి తరగతి రైలుపెట్టె నుంచి గెంటివేసిన ఉదంతం మన మందరం ఎరిగినదే. ఇది 1890వ సం॥ ప్రాంతంలో జరిగినది. ఈ జాతివివక్షతా సిద్ధాంతాన్ని వ్యతిరేకించి గాంధీజీ 'నేటాల్ ఇండియన్ కాంగ్రెస్'ను స్థాపించి, అహింసాయుత పోరాటం సాగించాడు.

గాంధీజీ సాగించిన సత్యాగ్రహ పోరాటం, నెల్సన్ మండేలాకు ప్రేరణ కలిగించింది. ఆయన ఆఫ్రికన్

నేషనల్ కాంగ్రెస్ (ఏ.ఎన్.సి) ద్వారా తన జాతి జనుల హక్కుల కోసం పోరాటం ప్రారంభించాడు. 1948వ సం॥లో ప్రభుత్వం జాతివివక్షతను చట్టబద్ధం చేసింది. దాంతో శ్వేతజాతి ప్రభుత్వాన్ని అధికారం నుంచి తొలగించడానికి ఏ.ఎన్.సి. పోరాటంమొదలు పెట్టింది. శ్వేతజాతి ప్రభుత్వం 1952వ సం॥లో మండేలాను ఖైదు చేసి యావజ్జీవ కారాగార శిక్ష విధించింది. అయినా, ఏ.ఎన్.సి. పోరాటం సాగిస్తూ వచ్చింది. 1989 సం॥లో అధ్యక్ష పదవిని చేపట్టిన డీక్లర్క్ ఈ సమస్యను గురించి తీవ్రంగా ఆలోచించ సాగాడు. ప్రపంచ వ్యాప్తంగా అనేక దేశాలు మానవ హక్కుల పునరుద్ధరణ కోసం దక్షిణ ఆఫ్రికా మీద ఆంక్షలు విధించాయి. దక్షిణాఫ్రికాలో జరిగిన క్రికెట్ పోటీలకు ప్రపంచ దేశాలు తమ జట్లను పంపలేదు. అలాగే ఇతర దేశాలలో జరిగిన పోటీలలో పాల్గొనడానికి దక్షిణ ఆఫ్రికాను నిషేధించాయి. ఒలింపిక్ క్రీడలలో సైతం దక్షిణ ఆఫ్రికా పాల్గొనలేక పోయింది. ఆఖరికి, డీక్లర్క్ జాతివివక్షతా చట్టాన్ని రద్దు చేయాలని నిర్ణయించి, దానికి తొలి మెట్టుగా నెల్సన్ మండేలాను జైలు నుంచి విడుదల చేశాడు. మండేలా అల్ప సంఖ్యాక శ్వేత జాతి ప్రభుత్వంతోనూ, జులుస్ వంటి ఇతర నల్లజాతి వర్గాలతోనూ సంప్రదింపులు జరపడానికి అంగీకరించాడు. నల్లజాతి ప్రజలు కూడా ఎన్నికలలో పాల్గొని, పార్లమెంటు సభ్యులయ్యే హక్కు కోసం వాదించి, విజయం సాధించాడు. సాధారణ ఎన్నికలకు తేదీ నిర్ణయం జరిగింది. ఎన్నికలు న్యాయబద్ధంగానూ, స్వేచ్ఛగానూ జగడానికి వీలుగా, ప్రపంచదేశాలు తమ ప్రతినిధుల బృందాలను పర్యవేక్షించడానికి పంపాయి. ఎన్నికలు మొత్తంమీద శాంతియుతంగానే జరిగాయి.




ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ 62 శాతం పైగా ఓట్లు పొంది, అధ్యక్షుణ్ణి ఎన్నుకునే హక్కును సాధించింది. నెల్సన్ మండేలా ఏకగ్రీవంగా దేశాధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. మండేలా తన పార్టీకి చెందిన ఒక నాయకుణ్ణీ, మాజీ అధ్యక్షుడు డీక్లర్క్‌నూ ఉపాధ్యక్షులుగా నియమించాడు. 39 మంది గల మంత్రి మండలిలో నలుగురు భారతీయ సంతతి వారికి స్థానం కల్పించాడు. భారతీయ సంతతికి చెందిన ఒక మహిళను పార్లమెంటు స్పీకర్‌గా ఎన్నుకోవడం చెప్పుకోతగ్గ విశేషం!

తన ప్రారంభ ఉపన్యాసంలో నెల్సన్ మండేలా ఇలా అన్నాడు: "మనసులో ఎటువంటి భయాందోళనలు లేకుండా, మానవతను నిలిపేలాగా నల్లజాతి ప్రజలూ, శ్వేతజాతి ప్రజలూ సమానంగా, గౌరవంగా జీవించే దక్షిణాఫ్రికా నిర్మాణం కోసం కృషి చేస్తాను!"

ప్రపంచ ప్రసిద్ధి గాంచిన ఈ 'రాజకీయ ఖైదీ' తనకు ప్రేరణ కలిగించి తన ప్రజల విజయానికి తోడ్పడిన మహాత్మా గాంధీ సిద్ధాంతాలను, ఎన్నటికీ మరిచిపోడని విశ్వసిస్తున్నాము.




# డబ్బు విలువ

సీతాకరుడు అనే ఆయన వడ్డీ వ్యాపారం చేసేవాడు. అప్పు కోసం వచ్చేవాళ్ళతో ఎంతో మర్యాదగా మాట్లాడతాడని, అంతా ఆయన దగ్గరకే వెళ్ళేవారు. కష్టం తెలియకుండా బాకీ వసూలు చేస్తాడని కూడా ఆయనకు పేరు.

తనవద్దకు వచ్చే వారందరికీ అప్పివ్వాలంటే సీతాకరుడి ఆస్తి చాలదు. రోజు రోజుకు ఆయన వద్ద అప్పు చేసేవారి సంఖ్య పెరిగిపోతున్నది. అప్పు పుచ్చుకున్న వివరాలు రాయడానికీ, బాకీల వసూళ్ళకూ ఆయన నలుగురు గుమస్తాలను కూడా పెట్టుకున్నాడు.

సీతాకరుడిలాగా వడ్డీవ్యాపారం చేయాలని చాలా మందికి వుంది. బాకీ వసూలు చేసే నేర్పు లేక వాళ్ళు సంకోచించేవారు. అలాంటి వాళ్ళలో చంద్రరాజు ఒకడు. ఆయనకు డబ్బాశ లేదు కానీ, తన దగ్గరున్న డబ్బుకు ఎంతో కొంత వడ్డీ సంపాదించాలని కోరిక.

చంద్రరాజు బాగా ఆలోచించి ఒక ఉపాయం పన్నాడు. సీతాకరుడు నూటికి పదిహేను రూపాయలు వడ్డీగా తీసుకుంటాడు. అందులో సగంగా నూటికి ఏడున్నర రూపాయలే వడ్డీ అంటే, చాలామంది తనవద్దకే ఎగబడతారు. తక్కువ వడ్డీకి అప్పునిచ్చాడన్న కృతజ్ఞత కొద్దీ, అంతా తనకు వెంటవెంటనే బాకీలు తీర్చేస్తారు!

ఈ ఉపాయాన్ని చంద్రరాజు భార్యకు చెప్పాడు. ఆమె ఆయన కంటే తెలివైనది. ఆమె కాసేపాలోచించి భర్తతో, "మీరు తొందర పడి అప్పులివ్వకండి. క్షణాల మీద మన ఆస్తి అంతా అప్పులకు పోతుంది. వడ్డీ ఎక్కువైతేనే సీతాకరుడికి బాకీవసూలు కొంత కష్టంగా వుంది. తక్కువైతే, మన దగ్గరకు అప్పుల కోసం వచ్చే ఎక్కువమంది జనం నుంచి బాకీలు వసూలు చేయడం మరింత కష్టమవుతుంది. అటు మన ఆస్తీ పోతుంది, ఇటు



సీతాకరుడికి మన పట్ల వున్న సదభిప్రా యమూ పోతుంది. ఆయన మనకు దూరపు బంధువు కూడా! ధర్మరాజంతటి సన్మార్గుడే యుద్ధంలో గెలిచే ఉపాయం తెలుసుకునేం దుకు, శత్రుపక్షాన వున్న భీష్ముడి వద్దకు వెళ్ళాడు. మీరు కూడా సీతాకరుడినే సలహా అడగండి. ఆ తర్వాత ఏం జరుగుతుందో చూడండి!" అని చెప్పింది.

ఏ కళనున్నాడో చంద్రరాజు, ఈ మాటలు నచ్చి సీతాకరుడి వద్దకు వెళ్ళాడు. ఆయన అంతా విని, "నువ్వు నావద్దకు రావడం మంచి పనే అయింది. వడ్డీవ్యాపారం అందరి వల్లా అయ్యే పనికాదు. డబ్బుతో వ్యవహారం కత్తి మీద సామువంటిది. అందులోని సాధక బాధ కాలన్నీ నాకు తెలుసు. అందుకే ఇంకా పెద్ద ఎత్తుకు నా వ్యాపారం పెంచబోతున్నాను. దాని కింకా డబ్బు కావాలి. నీవంటి వాళ్ళు నా దగ్గర డబ్బు దాచుకుంటే, నూటికి పది రూపా యల వడ్డీ ఇస్తాను. ఆ డబ్బును నేను వడ్డీకి తిప్పుకుని లాభం చేసుకుంటాను. అయితే నాదగ్గర డబ్బు దాచుకునేవాళ్ళు కనీసం అయిదు సంవత్సరాల దాకా తమ డబ్బును తిరిగి తీసుకోకూడదు," అన్నాడు.

ఈ పద్ధతి చాలా బాగుందని చంద్రరాజుకు తోచింది. ఏమీ శ్రమ లేకుండా తన డబ్బుకు వడ్డీ వస్తూంటే, అంతకంటే కావలసిన దేముంది? తను నూటికి ఏడున్నరే వడ్డీ తీసుకోవాలనుకున్నాడు. సీతాకరుడు పది రూపాయలిస్తానంటున్నాడు. అంతా బాగానే వుంది కానీ, అయిదేళ్ళ పాటు డబ్బును తిరిగి తీసుకోకుండా వుండడం సాధ్యమా? మధ్యలో ఏదైనా ప్రాణావసరం వస్తే, ఏం చేయడం? ఎవరిని అడగడం?

చంద్రరాజు సందేహం విని, "అలాంటి పరిస్థితి వస్తే, నీ డబ్బులోంచి నాలుగింట మూడువంతుల దాకా, నా దగ్గర్నుంచే అప్పుగా తీసుకోవచ్చు. నీ డబ్బు హామీగా వుంది కాబట్టి, నేను నీ దగ్గర పన్నెండు శాతం వడ్డీ మాత్రమే తీసుకుంటాను. అందులో పది శాతం ఎలాగూ నీకు వచ్చేదే! అంటే రెండు శాతం వడ్డీతో నీకు అప్పు దొరుకుతుందన్న మాట! నువ్వెంత త్వరగా బాకీ తీర్చితే, అంత

తక్కువ వడ్డీ నీకు నష్టమవుతుంది," అన్నాడు సీతాకరుడు.

ఇదంతా ఏదో తిరకాసులా అనిపించి, వెంటనే ఏ మాటా చెప్పకుండా ఇంటికి వెళ్ళి భార్యను సలహా అడిగాడు చంద్రరాజు.

ఆమె నవ్వి, "ఇది ఎంతో బాగుంది. మనకు అడపా దడపా పొలాల నుంచీ, కొబ్బరి తోటల నుంచీ డబ్బు అందుతూంటుంది. మనమది వృధాగా ఖర్చు చేస్తున్నాం. వడ్డీ వస్తుందంటే డబ్బు దాచుకోవాలనిపిస్తుంది గదా. వడ్డీ ఇవ్వాలి కాబట్టి ఎంతో అవసరం అయితే తప్ప అప్పు చెయ్యం. ఈవిధంగా వృధా ఖర్చులు తగ్గి మన ఆస్తిపాస్తులు పెరుగు తాయి," అని వివరించింది.



చంద్రరాజు మారాలోచన లేకుండా కొంత డబ్బు సీతాకరుడి వద్ద దాచుకున్నాడు.

చంద్రరాజుకు పొరుగునే వీరభద్రుడనే అతను వుంటున్నాడు. వాళ్ళిద్దరూ చిన్ననాటి స్నేహితులు. ఆస్తిపాస్తుల్లో ఇద్దరూ సమానమే అయినా, వీరభద్రుడు దుబారా మనిషి. తనకున్నది చాలక చంద్రరాజు నుంచి చేబదుళ్ళు తీసుకుని నెమ్మది మీద తీర్చుతూంటాడు. ఇప్పుడు చంద్రరాజు తన డబ్బును సీతాకరుడి వద్ద దాచుకోవడం మొదలుపెట్టాక, వీరభద్రుడికి చేబదులు దొరకడం కష్టమయింది.

"దుబారా ఖర్చులు తగ్గించుకో! డబ్బును పొదుపుగా వాడి మిగిలింది సీతాకరుడి వద్ద దాయి. నువ్వు సుఖపడతావు, ముమ్ముందు నీ పిల్లలు సుఖపడతారు," అని చంద్రరాజు సలహా కూడా ఇచ్చాడు.

ఈ సలహా వీరభద్రుడికి నచ్చలేదు. ఆయన భార్యతో మిత్రుడన్న మాట చెబితే, "ఎవరి పద్ధతులు వాళ్ళవి. కొందరు డబ్బు దాచుకుంటారు. కొందరు డబ్బుతో సుఖపడతారు. మనం సుఖపడేవాళ్ళం!" అన్నదామె.

ఆ తర్వాత వారం రోజులకు వీరభద్రుడి పొలంలో మిరపకాయలకు మంచి ధర వచ్చి, నాలుగు వేల రూపాయలు అతడి చేతికి వచ్చాయి. ఇంటి ఖర్చులు పోగా ఇంకా మూడు వేలు మిగిలింది. దాంతో వజ్రాల హారం చేయించుకోవాలని వీరభద్రుడి



భార్య మనసు పడింది. గురులింగాచారి వద్దకు వెళితే — ఎంత తక్కువ రకమైనా కూడా అయిదువేల రూపాయల లోపులో వజ్రాల హారం రాదన్నాడు.

"నిన్ననే నీ స్నేహితుడికి కొబ్బరి తోటల పంట మీద అయిదువేల రూపాయలు వచ్చింది. ఇంకా సీతాకరుడి దగ్గర దాచి వుండడు. వెళ్ళి అప్పు అడుగు!" అన్నది వీరభద్రుడి భార్య.

వీరభద్రుడు, చంద్రరాజు వద్దకు వెళ్ళి సంగతి చెప్పాడు. ముందు చంద్రరాజు వజ్రాలహారం అనవసరమనీ, ఆ మూడువేలూ సీతాకరుడి వద్ద దాచుకోమనీ మిత్రుడికి హితబోధ చేశాడు.

అయితే, వీరభద్రుడు, "కొన్ని అవసరాలు నీకు అర్థం కావు. ఆ వజ్రాలహారం చేయించక పోతే నా భార్య దిగులుతో చచ్చిపోతుంది. డబ్బుకోసం భార్యను చంపుకునేంత దుష్టుణ్ణను కుంటున్నావా?" అన్నాడు.

అప్పుడు చంద్రరాజు చేసేది లేక, "అయితే ఒక పని చేద్దాం. నేను కొబ్బరి తోటల మీద వచ్చిన డబ్బును సీతాకరుడి వద్ద దాచుకుంటాను. అందులోంచి నీక్కావలసింది అప్పుగా తీసుకుంటాను. మామూలుగా అయితే ఆయన నూటికి పదిహేను రూపాయలు వడ్డీ తీసుకుంటాడు. తనదగ్గర డబ్బు దాచుకున్నవారికి మాత్రం నూటికి పన్నెండు రూపాయల వడ్డీకే అప్పిస్తాడు. ఇందువల్ల నూటికి మూడు రూపాయల ఆదా! నీ భార్యకు ప్రాణాపాయం కలగవచ్చు అంటున్నావు కాబట్టి ఈ ఉపాయం చెప్పాను. ఆపైన నీ ఇష్టం!" అన్నాడు.

ఎంత దుబారా మనిషయినా, అంతవరకూ చేబదుళ్ళే తప్ప వడ్డీకి అప్పు తేలేదు, వీరభద్రుడు. అవసరాన్ని భార్య ప్రాణాలతో ముడిపెట్టాడు గనక, ఇప్పుడు తప్పలేదు. స్నేహితుడని కూడా చూడకుండా వడ్డీకి అప్పులిస్తున్నాడని, వీరభద్రుడిక ఏమీ అనలేక ఊరుకున్నాడు.

చంద్రరాజు తనే వెళ్ళి సీతాకరుడి దగ్గర డబ్బు దాచి, తనే అప్పు తెచ్చి, వీరభద్రుడికిచ్చాడు. అతని భార్య కూడా చంద్రరాజు ప్రవర్తనకు నొచ్చుకుని, "నీ మిత్రుడు మంచి

వాడనుకున్నాం. డబ్బు కక్కుర్తి చాలా ఎక్కువ. స్నేహధర్మం ఏమాత్రం తెలియదు!" అని దుర్భాషలాడింది.

ఏమైతేనేం — వీరభద్రుడు, భార్యకు వజ్రాల హారం చేయించాడు. తమ బాకీకి వడ్డీ కట్టాలని తెలియడం వల్ల కొంతకాలం పాటు దంపతులు ఎంతో పొదుపుగా వుండి, అయిదు నెలల్లో కొంత డబ్బును వెనక వేశారు.

ఒకరోజున రెండువేల వంద రూపాయలు తీసుకుని వీరభద్రుడు, చంద్రరాజు ఇంటికి వెళ్ళాడు. చంద్రరాజు డబ్బు లెక్కపెట్టుకుని వంద రూపాయలు తిరిగి యిస్తూ, "నువ్వు నాదగ్గర తీసుకున్నది రెండువేలే కదా! ఈ వంద దేనికి?" అన్నాడు.

"అది అయిదు నెలల వడ్డీ," అన్నాడు వీరభద్రుడు కటువుగా.

"ఛీ! స్నేహితుడి చేబదులుకు వడ్డీ తీసుకుంటానా? నేను నీతో వడ్డీ వ్యాపారం చేస్తాననుకున్నావా? మనం చిన్ననాటి నుంచీ స్నేహితులం. ఇంతేనా నువ్వు నన్నర్థం చేసుకున్నది," అన్నాడు చంద్రరాజు నొచ్చుకుంటూ.

దానికి వీరభద్రుడు, "ఇప్పుడు నీ మనసు మారిందేమో! అప్పిచ్చినప్పుడు నువ్వేమన్నావో గుర్తుచేసుకో. నీదగ్గర వున్న డబ్బును సీతాకరుడి దగ్గర దాచి, అందులోంచి అప్పు చేస్తానన్నావు," అన్నాడు వీరభద్రుడు నిష్ఠూరంగా.

"భలేవాడివే! ఆ అన్నదంతా నాగురించి. ఆ లెక్కలన్నీ నాగురించి. డబ్బు దాచుకోవడం వల్ల నాకు లాభం. అందులోంచి అప్పు చేసి అది నీకిస్తే, ఆ వడ్డీ నేనే కట్టుకుంటాను. ఆ వడ్డీ ఎంతో నీకు చెప్పాను, అంతే! అందువల్ల డబ్బు దాచుకోవడంలోని విలువ నీకు తెలుస్తుందనీ, నీకు చేబదులివ్వడం వల్ల నాకు కలిగే నష్టం హెచ్చరికగా పనిచేస్తుందనీ అనుకున్నాను. అంతేకానీ, ఆ వడ్డీ నీనుంచి తీసుకోవాలనుకోలేదు," అన్నాడు చంద్రరాజు.

మిత్రుడి మంచితనం, డబ్బువిలువ ఒక్కసారిగా వీరభద్రుడికి అర్థమై, చంద్రరాజుకు క్షమాపణ చెప్పుకున్నాడు.

ఆతర్వాత వీరభద్రుడు దుబారా ఖర్చులు మానినా మానకపోయినా, ఎవరివద్దకూ చేబదులు కోసం మాత్రం వెళ్ళలేదు.



# బహుమతికి కారణం

బుర్రిపాలెం జమీందారు భూపతిరాయుడు, ఒక ఏడాది తన పుట్టిన రోజు సందర్భంగా, ఒక సాహితీ పోటీ ఏర్పాటు చేశాడు. ఆ పోటీ ఏమంటే — పరమశివుడిపై ఒక గంటలో వంద పద్యాలను ఆశువుగా చెప్పాలి. విజేతకు సరస్వతీపుత్ర బిరుదంతో పాటు, వెయ్యి వరహాలు బహుమతిగా ఇస్తానని ఆయన ప్రకటించాడు.

ఆ పోటీలో రజనీచంద్ర అనే పాతికేళ్ళ యువకుడూ, నారాయణాచార్యులు అనే ఒక ఎనభై ఏళ్ళ వృద్ధుడూ సమఉజ్జీలుగా నిలిచారు. జమీందారు ఎవరిని విజేతగా నిర్ణయిస్తాడో అని, సభలోని వారందరూ ఆతృతగా చూడసాగారు.

జమీందారు కొద్దిసేపు ఆలోచించి, నారాయణాచార్యులు పోటీలో నెగ్గినట్లు ప్రకటించాడు. ఆయనకు బిరుదు సన్మానాలతో పాటు, వెయ్యి వరహాలు బహుమతికూడా ఇవ్వబడింది.

సభ ముగిశాక దివాను, జమీందారును — పోటీలో రజనీచంద్ర కాక, నారాయణాచార్యులు నెగ్గినట్లు ప్రకటించడానికి, ఏదైనా ప్రత్యేక కారణం వున్నదా అని అడిగాడు. అందుకు జమీందారు, "లేకేం, దివాన్‌జీ! రజనీచంద్ర యువకుడు. ఈ ఏడాది కాకపోతే వచ్చే ఏడాది, కాకపోతే ఆపైఏడాది పోటీలో పాల్గొని నెగ్గే అవకాశం వుంది. పోతే, ఏక్షణమైనా రాలిపోవడానికి సిద్ధంగా వున్న పండుటాకు వంటివాడు, నారాయణాచార్యులు! ఇప్పుడు తప్పిపోతే, ఆయన విద్వత్తును సన్మానించుకునే అదృష్టం వచ్చే ఏడు మనకు దక్కక పోవచ్చుకదా?" అన్నాడు. —ఆర్. పట్టాభిరామరాజు





# కీర్తిసింహుడి కథ



[కోసలరాజు సుషేణుడికి జయసేనుడు ఆప్తమిత్రుడు. ఆయన కుమార్తె కీర్తిసేన. కీర్తిసేన శక్తిసామర్థ్యాలను పరీక్షించడానికి రాజు, ఆమెను అరావళీ పర్వతాలకు వెళ్ళి, విద్యాభ్యాసం ముగించుకుని వస్తూన్న యువరాజు కీర్తిసింహుణ్ణి దారి మళ్ళించమని కోరాడు. కీర్తిసేన అందుకు అంగీకరించింది. మొదట కంగారుపడిన జయసేనుడు తేరుకుని, కుమార్తెకు రాజు కోరిక అంతర్యం గురించీ, తమ పూర్వీకుల గురించీ వివరించసాగాడు: విచిత్రవర్మకు జయసేనుడు అద్భుతశక్తులు గల ముత్యాలహారాన్ని బహూకరించాడు. వేటకు వెళ్ళిన విచిత్రవర్మకు భూగర్భంలో ఒక శక్తి విగ్రహం కనిపించింది. దానిని గురించి ఆగమవేత్తలను సంప్రదించడానికి రాజు రాజధానికి తిరిగివచ్చాడు. — తరవాత]

రాజు విచిత్రవర్మ రాజధాని చేరుతూనే ఆయన కలుసుకున్న మొట్టమొదటి వ్యక్తి జయసేనుడు. రాజు చెప్పినదంతా విన్న జయసేనుడు కూడా, ఏదో తెలియని ఆనందమూ, ఆవేదనా అనుభవించాడు.

ఆతర్వాత, అనేక తర్జనభర్జనలూ, మీమాంసలూ జరిగి, చివరకు జయసేనుడితో సహా అందరూ తేల్చి చెప్పినది ఇది: ఇప్పట్లో ఆ శక్తి విగ్రహాన్ని అక్కడినుంచి కదిలించడం మంచిది కాదు. అక్కడే ఆలయం కట్టించి, విగ్రహ ప్రతిష్ఠాపన చెయ్యాలి. ఆ దేవత అనుగ్రహం కాని, ఆ విగ్రహం దొరికిన లాభం కాని, ప్రస్తుత మహారాజైన విచిత్రవర్మకు దక్కవు! రాబోయే తరంలో విచిత్రవర్మకు వారసుడైన ఒకానొక వీరుణ్ణి, ఆ దేవి కరుణిస్తుంది. అతడు ఆ దేవి కృపవల్ల రాజ్యవ్యాప్తి చేసి, దక్షిణాపథానికంతటికీ సార్వభౌముడవుతాడు. అతడి కీర్తి దిగంతాల వ్యాపిస్తుంది.

లక్ష్మీగాయత్రి



కొంతకాలం గడిచేసరికి ప్రజల్లో ఆ గుడి సంగతి మరుగున పడటం ప్రారంభమైంది.

ఇదంతా దైవలీలగా భావించిన విచిత్ర వర్మ, మనసులోనే శక్తికి నమస్కరించి వూరు కున్నాడు.

అలా కొన్ని సంవత్సరాలు గడిచాయి. హారం సహాయంతో విచిత్రవర్మ కనీవినీ ఎరుగనంత చక్కగా రాజ్యపాలన చేశాడు. తన రాజ్యంలో ఒకటి, రెండు చోట్ల భూమిలో వున్న నిధులను వెలికితీసి, అనేక ప్రజోపయోగ కార్యాలు చేశాడు. దానితో ఆయన పేరు దేశ దేశాలు మారుమోగిపోయింది. అంతేకాక, మొదట్లో గుప్తంగా వుంచబడిన ముత్యాల హారం మహిమ కూడా నెమ్మదిగా ఆనోటా ఈనోటా పడి, విస్తరించి, విచిత్రవర్మ పేరుతో పాటు, అతడి గొప్పదనానికి మూలకారణమైన వస్తువుగా దశదిశలా పేరు పొందింది. దానితో పాటే బాధలు కూడా ప్రారంభమయ్యాయి.

దక్షిణాపథంలో నాటికీ నేటికీ కూడా అత్యంత బలమైనదీ, సుభిక్షమైనదీ కోసల రాజ్యం. కోసల తర్వాత కాంభోజ, నగ దేశాలు దక్షిణాపథ రాజ్యాల్లో పెద్దవి. కాంభోజ దేశం, కోసలకు తూర్పున వున్నది. ఆ దేశానికీ కోసలకూ మధ్య గల సరిహద్దు అడవుల్లోనే శక్తి ఆలయం వున్నది.

అప్పట్లో కాంభోజను పరిపాలించిన చక్రాదిత్యుడు స్వతహాగా మంచివాడే గాని, అసమర్థుడు. అతడి పాలనలో ప్రజలు అనేక రకాల

అతడి పాలనలో ఈ దేవత కూడా, ఒకానొక ప్రసిద్ధనామంతో, నిత్యపూజలు అందుకోవడమేకాక, ఎంతో మహిమగల దేవతగా ఉత్సవాలూ, ఊరేగింపులూ జరుపుకుంటుంది!

ఇదంతా విన్న తర్వాత విచిత్రవర్మ, ఆ నాటి రాత్రి తనకు ఆనందమూ, ఆవేదనా ఒకేసారి ఎందుకు కలిగాయో గ్రహించాడు. చివరకు ఆయన బాధపడటం మానేసి, తన వంశస్థుడు అంతటి పేరుప్రతిష్ఠలకూ, గొప్పతనానికీ కారకుడు కాబోతున్నందుకు ఎంతో సంతోషించి — శక్తి విగ్రహానికి అక్కడ అడవిలోనే గుడి కట్టించి అందులో ప్రతిష్ఠించాడు. అయితే, అడవిలో వున్న ఆ గుడికి వెళ్ళి పూజలు చేసేవారు ఎవరూ లేకపోయారు.

బాధలు చవిచూశారు. వారి బాధామయ జీవితాల మధ్య విచిత్రవర్మ పాలనా, కోసల ప్రజల సుఖజీవితాలూ గురించి కథలుగా చెప్పుకునేవారు. క్రమంగా కాంభోజ ప్రజలు కూడా కోసలకు వలస రావటం ప్రారంభిం చారు. దయాళుడైన విచిత్రవర్మ పాలనలో వారికి ఆదరణా, సుఖశాంతులతో కూడిన జీవితమూ లభించాయి.



ఈ పరిస్థితుల్లో విచిత్రవర్మ, జయసేనుడు, అటు చక్రాదిత్యుడు కూడా వృద్ధులయ్యారు. విచిత్రవర్మ పెద్ద కుమారుడైన జయవర్మ ఇక్కడ కోసల సింహాసనాన్ని అధిష్ఠించాడు. అక్కడ చక్రాదిత్యుడి జ్యేష్ఠ పుత్రుడు కూడా రాజు కావలసి వున్నది. కాని అతడు కూడా అసమర్థుడు కావటం వల్ల, పరిస్థితులన్నీ గమనిస్తున్న చక్రాదిత్యుడి రెండవ కుమారుడు వరుణదత్తుడు, తండ్రినీ, అన్ననూ బందీలుగా చేసి, రాజ్యాధికారం హస్తగతం చేసుకున్నాడు. అసమర్థుడి పాలనతో విసిగిపోయిన రాజో ద్యోగులూ, ప్రజలూ కూడా అతడికి సహాయం చేశారు.

అయితే, తండ్రి, అన్న అసమర్థులైతే వరుణదత్తుడు ఒకరకమైన మూర్ఖుడు! అతడు కోసలరాజు ఔన్నత్యం గురించి ప్రజలు గొప్పగా చెప్పుకోవటమూ, వాళ్ళు వెళ్ళి అతణ్ణి ఆశ్రయించటమూ భరించలేకపోయాడు. తన రాజ్యం కంటే కోసల ఉన్నతస్థితిలో వుండ టానికి కేవలం, జయసేనుడు కోసలరాజుకు తయారుచేసి ఇచ్చిన అపూర్వహారమే కారణ మని దృఢంగా నమ్మిన వరుణదత్తుడు, ఆ హారాన్నికుయుక్తితో సంపాదించి,తన రాజ్యాన్ని కోసలతో సరితూగేలా చెయ్యాలని నిర్ణయిం చుకున్నాడు. తక్షణమే, ఆ హారం సంపాదించ టానికి, ఒక పథకం కూడా రూపొందించాడు. ఆ పథకానికి దారితీసినదీ, తోడ్పడినదీ కోసల రాజు జయవర్మ ప్రవర్తనే!

జయవర్మ మంచివాడు, సమర్థుడు. అయితే, విలాసపురుషుడు! చిత్ర విచిత్రాలైన విలాస మందిరాలను నిర్మించటమూ, దేశ విదేశాలనుంచి వచ్చిన నర్తకీమణుల నాట్యాలు చూసి, వారికి బహుమానాలిచ్చి తిరిగి సాగ నంపటమూ, అతడికి అత్యంత ప్రీతిపాత్రమైన



పనులు. ఈరకమైన అతడి ప్రవర్తన, తండ్రి విచిత్రవర్మకు బాధాకరమూ, ప్రజల్లో చెడు పేరుకూ కారణమైంది.

ఇవన్నీ తెలుసుకున్న కాంభోజ రాజు వరుణదత్తుడు, కనకలత అనే నర్తకిని కార్యసాధన కోసం ఎంచుకున్నాడు. అత్యంత సౌందర్యవతి అయిన కనకలత, తన చతురతతో జయవర్మ దగ్గరి నుంచి అపూర్వ హారాన్ని తీసుకువచ్చి, వరుణదత్తుడికిచ్చి, అతడు ఇచ్చే బహుమానాలను తీసుకోవడానికి అంగీకరించింది.

అయితే, ఇక్కడే వరుణదత్తుడికి తెలియని విషయం ఒకటున్నది! మహారాజు విచిత్రవర్మ కొడుకుకు పట్టం కట్టినా, రాజ్య వ్యవహారం నుంచి పూర్తిగా వైదొలగలేదు. కొడుకు ప్రవర్తనలోని లోటుపాట్లు తెలిసిన విచిత్రవర్మ, జయవర్మకు కూడా తెలియకుండా, రహస్యంగా తనకొక గూఢచారి దళం ఏర్పాటుచేసుకుని వార్తలు ఎప్పటికప్పుడు పరిశీలిస్తూనే వున్నాడు. అయితే, సింహాసనం అధిష్ఠించిన రోజున మహారాజు, కొడుకు మెడలో వేసిన అపూర్వ హారం మాత్రం జయవర్మ దగ్గరే వున్నది.

వరుణదత్తుడు పంపిన కనకలత కోసలలో అడుగుపెట్టిన మరుక్షణం, ఆ వార్త విచిత్రవర్మకు చేరింది. ఏదో తెలియని అనుమానంతో విచారణ సాగించిన మహారాజుకు, కనకలత రాకవెనకవున్న కుతంత్రం యావత్తూ తెలియవచ్చింది.

ఆ వార్త విని ఆందోళన చెందిన మహారాజు, వెంటనే జయసేనుడితో సంప్రతించాడు. ఇద్దరూ కలిసి ప్రతివ్యూహం తయారు చేశారు. క్షణాల మీద అచ్చు గుద్దినట్టు అటువంటిదే మరొక హారం తయారైంది. నమ్మకమైన వ్యక్తి ద్వారా కృత్రిమ హారం జయవర్మ మెడలోకీ, అసలు మహిమ గల హారం మహారాజు మెడలోకీ చేరాయి.

ఆ తర్వాత కొద్దిరోజుల్లోనే కనకలత, తన హావభావవిన్యాసాలతో, చాతుర్యంతో రాజును పరవశింపజేసింది. జయవర్మ ఆనందంతో నిలుచున్నపాటుగా తన మెడలోని ముత్యాలహారాన్ని కనకలత మెడలో వెయ్య



టమూ, ఆ రాత్రికి రాత్రే కనకలత నగరం వదిలివెళ్ళిపోవటమూ జరిగిపోయాయి.

తను చేసిన ఘోర తప్పిదం తెలిసివచ్చిన జయవర్మ, ఉన్నపాటుగా తండ్రి దగ్గరకు పరుగెత్తుకు వెళ్ళాడు.

అతడు వెళ్ళేసరికి విచిత్రవర్మ, జయసేనుడితో చదరంగం ఆడుతున్నాడు. తండ్రితో పాటు వున్నది జయసేనుడే గనుక, జయవర్మ దాపరికం లేకుండా తాను చేసిన తప్పు ఇద్దరికీ చెప్పి, తిరిగి హారాన్ని సంపాయించే మార్గం ఆలోచించమని కోరాడు.

అంతా విని నిట్టూర్చిన విచిత్రవర్మ, కొడుకుతో, "ఆ హారం ఒకసారి మన వంశీకుల చెయ్యి దాటి మరొకరి కంఠాన్ని అలంకరించటమంటూ జరిగితే, ఆ మరుక్షణం దాని ప్రభావాన్ని కోల్పోతుంది, నాయనా! అందుచేత, ఇక దాన్ని గురించి మరిచిపోవటం ఉత్తమం!" అన్నాడు.

అతడి మాటలు విని జయవర్మతో పాటు జయసేనుడు కూడా ఆశ్చర్యపోయాడు. జయవర్మ మనసు కాస్త తేలికపడినా, అంతటి అపూర్వ హారాన్ని పోగొట్టుకున్న బాధతో ఏదో చెప్పబోయాడు.

విచిత్రవర్మ, కొడుకును వారిస్తూ, "రసిక హృదయుడైన రాజు, తన కళాభిమానంతో కళాకారుల్ని ఆనందింపజెయ్యాలే గాని, తాను ఉన్మత్తుడు కారాదు! రాజు తన మనసును పూర్తిగా కేంద్రీకరించవలసింది ప్రజల కష్టసుఖాల మీద గాని, సొంత సుఖాల మీద కాదు. తామరాకు మీద నీటిబొట్టు చందంగా విలాసాలనుఅనుభవించగలిగినవాడే ఉత్తముడైనరాజు! ఇక వెళ్ళిరా!" అన్నాడు.

జయవర్మ బాధావమానాలతో తల వంచుకుని వెళ్ళిపోయాడు. అతడు వెళ్ళిన తర్వాత జయసేనుడి ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూస్తూ విచిత్రవర్మ, "నేను అబద్ధం ఎందుకు చెప్పానా అని ఆలోచిస్తున్నావా, జయసేనా? ఒక్క విషయంచెప్పు! జయవర్మ దగ్గరినుంచి హారాన్ని అడిగి తీసుకోవాలని మనం ఎందుకు తొందరపడినట్టు?" అని ప్రశ్నించాడు.

జయసేనుడు ఆ ప్రశ్నకు జవాబు చెప్పక మౌనం వహించాడు.

అప్పుడు విచిత్రవర్మ చిన్నగా తలపంకించి, "నీకు తెలుసు, జయసేనా! ఆ హారం మెడలో వుంటే, కాంభోజ నర్తకి మాటల్లోని అసత్యం, కపటం జయవర్మకే తెలుస్తాయి! అతణ్ణి వంచించి ఆ హారం తీసుకువెళ్ళటం అన్నప్రసక్తేరాదు. ఇదంతా కాంభోజ రాజుకూ తెలుసు! అయినప్పటికీ అతడు ఆ పథకం వేశాడు. మనం హారాన్ని జయవర్మ మెడలోంచి తప్పించాం. ఇదంతా ఎందుకు జరిగింది? జయవర్మ మనోదౌర్బల్యం వల్ల. అతడి ఉన్మత్త ప్రవర్తన వల్ల. దుర్బలుడూ, ఉన్మత్తక్రియలతో సంచరించేవాడూ, భగవత్ప్రసాదితమైన మేధాశక్తినే కోల్పోతాడు. సహజమైన మానసిక శక్తులకు పదునుగా చెప్పబడే, ఈఅతీంద్రియ శక్తులనుసరిగా ఉపయోగించుకోలేడు. మూర్ఖుడైనప్పటికీ వరుణదత్తుడు ఈ విషయాన్ని చక్కగా ఊహించాడు. అందువల్లనే అతడు, కనకలత ద్వారా జయవర్మను మరింత దుర్బలుణ్ణి చేసి, హారం సంపాదించాలనుకున్నాడు, అవునా?" అన్నాడు.

జయసేనుడు మౌనంగా తలవూపి వూరుకున్నాడు.

విచిత్రవర్మ నవ్వి, "జయవర్మ మీద నాకంటే నీకే ఎక్కువ వాత్సల్యమని నాకు తెలుసు, జయసేనా! ఒకసారి దెబ్బతిన్న జయవర్మ, ఇకనుంచి జాగ్రత్తగా వుంటాడనీ, హారం అతడికి తిరిగి ఇవ్వవచ్చుననీ, నీ ఆలోచన! కాని, ఇటువంటి విషయాల్లో



అభిమానం కంటే బాధ్యతకూ, నమ్మకం కంటే అపనమ్మకానికీ ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వాలి. దుర్బల స్వభావుడైన జయవర్మ, ఈ సంఘటనతో మారవచ్చు, మారకనూ పోవచ్చు! అటు వరుణదత్తుడికి తాను సంపాదించినది నకిలీ హారమనీ, అసలు హారం మనదగ్గరే వున్నదనీ తెలిస్తే, ఈసారి ఎటువంటి ఘాతుకానికైనా ఒడిగడతాడు. ఇవన్నీ ఆలోచించే ఆ అబద్ధం చెప్పాను. ఇప్పుడు జయవర్మ, వరుణదత్తులిద్దరూ అసలు హారం శక్తి కోల్పోయిందనే అనుకుని దాన్ని గురించి మరిచిపోతారు. ఇక హారం సంగతంటావా? దాన్నిగురించి కూడా ఒక దృఢమైన నిర్ణయం తీసుకున్నాను. ఎటూ మన ముందు

నా వంశంలో ఒక మహోన్నత వ్యక్తి ఉద్భవిస్తాడు. నువ్వు నాకు కానుకగా ఇచ్చిన ఈ హారానికీ, ఈ హారం ద్వారా నాకు లభ్యమైన దైవ సంపదకూ కూడా, అతణ్ణే వారసుణ్ణి కానీ!" అన్నాడు.

మహారాజు రాజనీతినీ, ధర్మప్రవర్తననూ మనసులోనే మెచ్చుకుంటూ, మౌనంగా మహారాజుకు అంగీకారం తెలిపాడు జయసేనుడు.

విచిత్రవర్మ ఊహించినట్టే, అతడు జయవర్మతో అన్న మాటలు వరుణదత్తుడిదాకా చేరాయి. హారం నిజంగానే శక్తి కోల్పోయిందని నమ్మిన అతడు బాధపడి వూరుకున్నాడు.

జరిగినదానితో చాలా విచారగ్రస్తుడైన జయవర్మలో మాత్రం పెద్ద మార్పు వచ్చింది. అతడు నానాటికీ విలాసాలు తగ్గించుకుని, బాధ్యతలు పెంచుకున్నాడు. కోసల ప్రజల్లో రాజు పట్ల అభిమానమూ, విశ్వాసమూ పెరిగాయి.

ఇదంతా తృప్తిగా చూసిన మహారాజు విచిత్రవర్మ, ఆ తర్వాత కొద్ది కాలానికి స్వర్గస్థుడయ్యాడు. విచిత్రవర్మ మరణించిన కొన్ని నెలల తర్వాత జయసేనుడు కూడా మరణించాడు. మరణించబోయే ముందు జయవర్మను కలుసుకున్న జయసేనుడు, అతడికి జరిగినదంతాపూసగుచ్చినట్టు చెప్పి, "నాయనా! నీలో వచ్చిన మార్పును గమనించి, నీకు హారం తిరిగి ఇవ్వమని మహారాజుకు చెప్పి చూశాను. కాని, ఆయన తన సంకల్పాన్ని విడిచిపెట్టలేదు. 'ఎందుకు కలిగిందో నాకు ఒకసారి ఒక సంకల్పం కలిగింది. ఇక దాన్ని మార్చుకోదలచుకోలేదు. నా నిర్ణయం అన్ని విధాలా మంచిదేనని, నా విశ్వాసం. ఇక ఆ విషయం వదిలెయ్యి, జయసేనా! ఆ హారం ధరించబోయే వ్యక్తి జయవర్మ కొడుకో, మనమడో అయినా కావచ్చు. హారం నా వంశాన్ని దాటి మరెక్కడికీ పోదు కదా!' అన్నారు. అంతేకాదు, ఆ హారం ఎక్కడ దాచారో కూడా నాకు చెప్పలేదు. ఈ ఉత్తరం మాత్రం నా చేత రాయించి, నేను మరణించేలోగా నీకు ఇవ్వమని చెప్పారు. ఇదిగో, ఆ ఉత్తరం!" అంటూ జయవర్మకు ఒకచిన్న దంతపు పెట్టె ఇచ్చాడు. — (ఇంకావుంది)








# నేరము - శిక్ష

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, భీతిగొలిపే ఈ శ్మశానంలో ఇంత అర్ధరాత్రివేళ, ఎన్నో శ్రమలకు గురవుతూ కూడా పట్టు వీడని నీ మనోనిబ్బరం, అనితరసాధ్యమే; కాదనను. అయితే, ఇన్ని శ్రమలకోర్చి నువ్వు సాధించదలచిన కార్యం ఏమై వుంటుందన్నది, నాకు అంతు చిక్కడం లేదు. అయితే, కొందరు తమకు గల అమానుష,అలౌకికశక్తుల ద్వారా దేనినైనా సాధించగలమని చెప్పుకుంటారు. వాటిలో వున్న సత్యాసత్యాలమాట అటుంచి — అలాంటి వారెవరైనా, నిన్నేదో అసాధ్యమైన పనికి పురికొల్పారా అన్న అనుమానం కలుగుతున్నది. అదే నిజమైతే, నీ శ్రమంతా వృథా! చివరకు ఏదో సాధించానన్న భ్రమతో తృప్తిపడవలసి

## బేతాళ కథలు



వుంటుంది. ఇందుకు ఉదాహరణగా, చంద్రసేనుడనే రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ద్విచక్రపురాన్ని పాలించే చంద్రసేనుడనే రాజు వేటకు అరణ్యానికి వెళ్ళాడు. అక్కడ దారి తప్పి అలసటతో, దాహంతో అటూ ఇటూ తిరుగుతూండగా ఆశ్రమం ఒకటి కనబడింది. అందులో ప్రదీపుడనే ముని వున్నాడు. ఆయన రాజును ఆదరించి దప్పిక తీర్చి ఆశ్రయమిచ్చాడు.

"నేను చంద్రసేనుడనే రాజును. తమరెవరు? ఈ అరణ్యంలో ఎంతకాలంగా వుంటున్నారు?" అని అడిగాడు చంద్రసేనుడు కుతూహలంగా.

"ఒకానొకప్పుడు నేనూ రాజునే! నా పేరు ప్రదీపుడు. నా ప్రజలకు నేర, చోర భయం లేకుండా చేయాలని శిక్షాస్మృతిని అతి తీవ్రంగా అమలు చేసేవాడిని. ఉన్నట్టుండి నాకు జబ్బు చేసింది. ఏ మందుకూ లొంగ లేదు. ఒకరోజున నన్ను చూడడానికి హిమాలయాల నుంచి మహాత్ముడొకడు వచ్చాడు. ఆయన నాతో, 'నువ్వు నేరానికి తగిన శిక్ష వేయక నేరస్థులను బాధపెట్టావు. ఆ పాపమే నీ ఆరోగ్యం పాడుచేసింది. అరణ్యానికి వెళ్ళి తపస్సు చేసి, నీ పాపాలను ప్రక్షాళనం చేసుకో,' అని చెప్పాడు. ఆ తర్వాత కొద్ది రోజులకు, నేను నా రాజ్యాన్ని నా తమ్ముడికి అప్పజెప్పి భార్యతో సహా అరణ్యానికి వచ్చాను. ఏడాది పాటు తపస్సు చేసేసరికి నా జబ్బు తగ్గింది. కానీ, నాలోని రాజరికం మీద మోజు పోయింది. ఈలోగా రాజభోగాలు మరిగిన నా తమ్ముడు, నా గురించి భయపడి నన్ను చంపమని ఇద్దరు భటులను పంపాడు. వాళ్ళు నాదగ్గరకు వచ్చి నన్ను చంపలేక నిజం చెప్పారు. అప్పటినుంచీ నేను ప్రతి ఏటా ఒక్కొక్క అరణ్య ప్రాంతంలో వుంటూ, ఆరునెలల క్రితం ఈ ప్రాంతానికి వచ్చాను. నన్ను క్రూరమృగాలు తిన్నట్టు భటులు నా తమ్ముడికి చెప్పారు. అతడది నమ్మి ఊరుకున్నాడు. కొద్ది రోజుల్లో నేనిక హిమాలయాలకు పోదామనుకుంటున్నాను," అన్నాడు ప్రదీపుడు.

ఇదివిన్న చంద్రసేనుడికి ఆశ్చర్యంతోపాటు భయం కూడా కలిగింది. ఆయన అనుమా నంగా, "స్వామీ! నేరస్థుల మీద నాకు పగ లేదు. కానీ, వారిని కఠినంగా శిక్షించకపోతే సామాన్యులకు ప్రమాదం కదా! ఈ విష యంలో నేనేం చేయాలి? నేనూ మీలాగే జబ్బు చేసి రాజ్యం విడిచిపెడతానా?" అని అడిగాడు.

దానికి ప్రదీపుడు, "అన్ని పాపాలూ అందర్నీ ఒకేలాగా బాధించవు. నేను నా జీవితంలో మరెన్నో పాపాలు చేయడం వల్ల, వాటికి ఈ పాపమూ తోడయి నన్ను బాధించింది. నువ్వు భయపడకు. కావాలంటే నేను నీకొక స్ఫటికాన్నిస్తాను. నేరనిర్ణయంలో అది నీకు సహకరించగలదు," అన్నాడు.

చంద్రసేనుడా స్ఫటికాన్ని చూసి ఆశ్చర్య పోయాడు. ఎంతో అందంగా వున్నదా స్ఫటికం. దాన్ని అరచేతిలో వుంచుకుని న్యాయనిర్ణ యం వినిపిస్తే — అది నేరానికి తగిన శిక్ష అయితే వెంటనే పసుపురంగులోకి మారు తుంది. శిక్ష అధికమైతే ఎరుపు రంగులోకీ, శిక్ష తక్కువైతే నలుపు రంగులోకీ మారే ఆ స్ఫటికం, తనకు తానుగా మాత్రం నిర్ణయాలు చెప్పలేదు.

"ఈ స్ఫటికాన్ని తపోశక్తితో సాధించాను. నేను హిమాలయాలకు వెళ్ళేలోగా దీన్ని ఏ దేశపు రాజుకైనా ఇవ్వాలనుకున్నాను. నీకు యోగముంది. స్ఫటికం నేరనిర్ణయానికి హెచ్చ రికగానే ఉపయోగపడుతుంది. సమర్థుడైన న్యాయాధికారిని నియమించుకుని పాపం





అంటుకోకుండా రాజ్యపాలనచెయ్యి," అన్నాడు ప్రదీపుడు.

చంద్రసేనుడా స్ఫటికాన్ని తీసుకుని రాజధానికి తిరిగివెళ్ళాడు. అంతకాలం ఆయన నేరస్థులను తనే స్వయంగా విచారిస్తూ వచ్చాడు. ఈ స్ఫటికం లభించాక – అయిదుగురు న్యాయశాస్త్ర నిపుణుల్ని తనకు సలహాదారులుగా నియమించుకున్నాడు. నేరస్థులను విచారించాక, ఆ నిపుణుల్ని విడివిడిగా అభిప్రాయమడిగి, స్ఫటికం నలుపు రంగులో వుంచే శిక్షనే అమలుచేసేవాడు.

అయితే ఒక విచిత్రం! ఆ స్ఫటికమెప్పుడూ ఎర్రగానో, నల్లగానో అయ్యేది తప్ప పసుపు రంగుకు ఎన్నడూ మారలేదు. అందువల్ల, ఏ నేరానికైనా అసలు శిక్ష ఏమిటో తెలుసుకోవడం రాజుకు సాధ్యమయ్యేది కాదు.

స్ఫటికం గురించి రాజు ఎవ్వరికీ చెప్పలేదు. కానీ ఎవరికీ తెలియకుండా ఎందరినో రాజు పరీక్షించాడు. వారిలో న్యాయశాస్త్ర నిపుణులున్నారు, పండితులున్నారు, అనేక రంగాల్లో సమర్థులున్నారు. ఒక్కరు కూడా తమ నిర్ణయంతో స్ఫటికాన్ని పసుపు రంగుకు మార్చలేకపోవడం, రాజుకు ఆశ్చర్యాన్ని కలిగించింది. నేర నిర్ణయం ఎంతో కష్టమని ఆయన అనుకున్నాడు.

చంద్రసేనుడు అన్నివేళలా స్ఫటికాన్ని తనవద్దనే వుంచుకునేవాడు. ఒకసారాయన మారువేషంలో నగర సంచారం చేస్తూ, ఒక చోట ఒక విచిత్ర దృశ్యాన్ని చూశాడు. పేదవాడిలా కనిపిస్తున్న వాడొకడు కాసుల మూటను, గొప్పవాడిలా కనిపిస్తున్న ఇంకొకడికి ఇస్తున్నాడు. పేదవాడి కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి. ఇదిచూసిన రాజుకు, రెండోవాడు మోసకారి అన్న అనుమానం కలిగింది.

రాజు చప్పున వాళ్ళను సమీపించి, "మీరు చేస్తున్నదేమిటి?" అని గద్దించి అడిగాడు.

పేదవాడు వెంటనే, "ఈయన మహాజ్ఞాని. నాకు సాయపడతానంటే, నేను కూడబెట్టిన డబ్బంతా ఇచ్చుకుంటున్నాను," అన్నాడు.

"నీక్కావలసిన సాయం ఏమిటి?" అని ప్రశ్నించాడు రాజు.

"అయ్యా! నాకు నలుగురు కొడుకులు. ఒకరోజున సాధువొకడు మా ఇంట భిక్ష తీసుకుని, నా నలుగురు కొడుకుల్లో ఒకడు మహాజ్ఞాని అవుతాడనీ, బాగా చదువు చెప్పించ మనీ అన్నాడు. వాళ్ళల్లో ఆ మహాజ్ఞాని కాబోయే వాడెవడో చెప్పాలంటే — నిప్పు గురించీ, జ్ఞానం గురించీ ఒకరు చెప్పాలా? అని వెళ్ళి పోయాడు. నలుగురు కొడుకుల్నీ చదువుకు పంపే తాహతు నాకు లేదు. కాబట్టి వాళ్ళల్లో జ్ఞాని ఎవరో తెలుసుకునేందుకే ఈ పెద్దమనిషి సాయం తీసుకుంటున్నాను," అన్నాడు పేద వాడు.

రాజు, మోసగాడి చేత డబ్బు పేదవాడికి తిరిగి ఇప్పించి, "పద, నేను నీకు సాయపడ తాను," అన్నాడు.

ఇద్దరూ దాపులనున్న పేదవాడి గుడిసెకు వెళ్ళారు. అప్పుడక్కడ పెద్ద గొడవ జరుగు తున్నది.

పేదవాడి కొడుకులు నలుగురూ కలిసి మట్టితో ఒక బొమ్మ చేసి, దానికి రంగులు పూసి అందంగా తయారుచేశారు. ఆ బొమ్మను సంతలో అమ్మితే మంచి ధర పలుకుతుందని చాలామంది అన్నారు. ఈలోగా పొరుగింటి చంద్రుడనేవాడు వచ్చి, కావాలని ఆ బొమ్మను విరగ్గొట్టి వెళ్ళాడు. నలుగురన్నదమ్ములూ వాణ్ణి తరిమి పట్టుకుని ఇంటికి తీసుకొచ్చారు. ఇప్పుడు వాడినెలా శిక్షించాలీ అని గొడవ.

ఇది చాలా మంచి అవకాశమని రాజుకు తోచింది. సాధువు చెప్పాడు కాబట్టి, నలు గురు అన్నదమ్ముల్లోనూ ఒకడు తప్పకుండా





జ్ఞాని అయి వుండాలి. వాళ్ళిప్పుడిచ్చే తీర్పులు వింటే ఆ విషయం రూఢి అవుతుంది!

చంద్రసేనుడు చప్పున స్ఫటికాన్ని తన అరచేతిలోకి తీసుకుని గుప్పెట మూసి, పేదవాడి పెద్ద కొడుకును తీర్పు చెప్పమన్నాడు.

"నూరు కొరడాదెబ్బలు!" అన్నాడు వాడు.

రాజు చూసుకుంటే స్ఫటికం ఎర్రగా మారింది. అప్పుడు రాజు మిగతావాళ్ళను అడిగాడు.

"వాడికున్న బొమ్మలన్నీ బద్దలుకొట్టాలి!" అన్నాడు రెండోవాడు.

అప్పుడూ స్ఫటికం ఎర్రగా మారింది.

"వాడిచేత ఇలాంటి బొమ్మనే చేయించి, అప్పుడు దాన్ని విరగ్గొట్టాలి!" అన్నాడు మూడోవాడు. వెంటనే స్ఫటికం నలుపు రంగుకు మారింది.

"వాడి కేశిక్ష వేస్తే మాత్రం మా బొమ్మ మాకు మళ్ళీ తిరిగొస్తుందా? నాకే గనక శక్తి వుంటే, వాడి తప్పులు వాడికి తెలిసేలా చేసే వాణ్ణి!" అన్నాడు నాలుగోవాడు.

ఆశ్చర్యంగా, రాజు అరచేతిలోని స్ఫటికం పసుపు రంగుకు మారింది. రాజు వెంటనే, ఆ నాలుగోవాడే భవిష్యత్తులో మహాజ్ఞాని కాగలవాడనుకున్నాడు. ఆయన పేదవాడికి తానెవరయినదీ చెప్పి, వాడి కుటుంబ పోషణకు ధన సహాయం చేస్తానన్నాడు. తర్వాత నాలుగోవాడికి తనే స్వయంగా విద్య చెప్పించడం అవసరం అని భావించి తనవెంట తీసుకుపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, పేదవాడి నాలుగో కొడుకు తీర్పుకు స్ఫటికం పసుపురంగుగా మారడం, నాకు కాకతాళీయం అనిపిస్తున్నది. ఎందుకంటే – అన్ని కాలాలకూ ఉపయుక్తమూ, ఏమాత్రం శంకించడానికి ఆస్కారం లేని శిక్షాస్మృతి అంటూ వుండే అవకాశం లేదు. కారణం, ఎప్పటికప్పుడు సామాజిక పరిస్థితుల్లో వచ్చే పరిణామాలు కారణంగానూ, రాజ్యాధికారాన్ని చెలాయించే వాళ్ళ క్షేమం, మేలుకు అనుగుణంగానూ శిక్షాస్మృతి కూడా అనేకమైన మార్పులకు లోనవుతూంటుంది. అందువల్ల, ఎంతటి న్యాయశాస్త్ర కోవిదుడైనా, మహాజ్ఞాని అయినా,

ఆయా కాల పరిస్థితులను గణనలోకి తీసుకునే న్యాయనిర్ణయం చెయ్యగలడు. కాలగమనంలో ఒకసారి ధర్మం, న్యాయం అనుకున్నవి, మరొక కాలంలో కాకుండా పోవడం తెలిసిందే! ఈ కారణాల వల్ల, ముని ప్రదీపుడు, రాజుకిచ్చిన స్ఫటికం న్యాయనిర్ణయానికి పనికి రాదని తేలుతున్నది కదా? ఈ సందేహాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కాలానుగుణంగా శిక్షాస్మృతి మారుతుందనేది నిర్వివాదాంశం. రాజు చంద్రసేనుడికెదురైన సమస్య వాటి మార్పు చేర్పుల గురించి కానే కాదు. తన రాజ్య పాలనా కాలంలో అమలులో వున్న శిక్షాస్మృతికి అనుగుణంగా తీర్పులిస్తున్నానా లేదా అన్నది, ఆయనను బాధిస్తున్న సమస్య. ముని తన తపోశక్తితో సృష్టించిన స్ఫటికం కాలాతీతమైనది. అది ఎలాంటి సామాజిక పరిస్థితులలోనైనా న్యాయమైన తీర్పేదో నిర్ణయించగలదు. అయితే, స్వయంగా అది న్యాయనిర్ణయం చేయలేదు గనక, దానికి జ్ఞాని అయినవాడి సాయం కావాలి. ఇందుకు, కేవలం న్యాయశాస్త్రవేత్త సరిపోడు. ఎందువల్లనంటే — ఎంతటి న్యాయశాస్త్రవేత్త అయినా అంతో యింతో వ్యక్తిగతమైన ఇష్టాయిష్టాలకూ, ఆవేశకావేషాలకూ దూరంగా వుండలేడు. జ్ఞాని సంగతి అలా కాదు. అతడు మనషుల నైజగుణాలనూ, ప్రవృత్తులతో పాటు, సమాజంలోగల హెచ్చుతక్కువ స్థాయిలను కూడా నిశితంగా పరిశీలించగలడు. ఈ కారణంవల్ల, శిక్షాస్మృతి పరంగా వున్న ఒకే నేరానికి ఒకే రకమైన శిక్ష అన్నదాన్ని జ్ఞానవంతుడు అంగీకరించడు. అందుచేత, నిజమైన జ్ఞాని సహాయంతో రాజు చంద్రసేనుడు తప్పక ముని ఇచ్చిన స్ఫటికాన్ని ధర్మపాలనకు ఉపయోగించగలడు. పేదవాడి నాలుగో కొడుకు ఇచ్చిన తీర్పుకు, స్ఫటికం పసుపు రంగుగా మారడం, కాకతాళీయం ఏమాత్రం కాదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)

[ఆధారం: శ్రీరామకమల్ రచన]



# మతిమరుపు!

సూర్యోదయంతోనే చెరువుకు స్నానానికి పోతున్న పోశెట్టి అనే ఆయన్ని, ఆతడి పొరుగూరి దూరపు బంధువైన వీశెట్టి దారిలో కలుసుకుని, "ఈ మాట నిజమేనా? మీ ఇంట్లో ఆ మధ్య వరసగా మూడుసార్లు దొంగలుపడి దోచుకుపోయారట!" అని అడిగాడు.

"ఆ మాట నిజమే!" అన్నాడు పోశెట్టి విచారంగా.

"మరి, భోషాణం అంత దాన్ని దొంగలు బద్దలు కొడుతున్నప్పుడు, నీకు మెలకువ రాలేదా?" అని అడిగాడు వీశెట్టి.

"ఎక్కడి మెలకువ! దొంగలు నా తలగడ కింది నుంచి భోషాణం తాళపుచెవులు తీసుకుని, చప్పుడు కాకుండా తలుపులు తెరిచి దోచుకెళ్ళారు," అన్నాడు పోశెట్టి.

"ప్రతిసారీ తాళపుచెవుల్ని తలగడ కింద దాచడానికి బదులు, మరెక్కడైనా దాయొచ్చుగదా?" అని అడిగాడు వీశెట్టి.

"అదీ చేశాను!" అన్నాడు పోశెట్టి నిట్టూరుస్తూ.

"ఎక్కడ దాచావేమిటి?" అన్నాడు వీశెట్టి.

"ఎప్పటిలా తలగడ కింద కాకుండా, వాటిని అటక మీద దాచాను," అన్నాడు పోశెట్టి.

"అయితే, దొంగలకా తాళంచెవులెలా దొరికినై?" అన్నాడు వీశెట్టి ఆశ్చర్యంగా.

"నా మతిమరుపు కొంప ముంచింది! దాచిన తాళపుచెవుల్ని మర్చిపోతానేమో అన్న అనుమానంతో ఒక చీటీ మీద – భోషాణం తాళపుచెవులు అటక మీద వున్నవి – అని రాసి, ఆ చీటీని తలగడకింద పెట్టుకుని పడుకున్నాను," అని జవాబిచ్చాడు పోశెట్టి. దానితో వరసగా అన్నిసార్లు దొంగతనం ఎలా జరిగిందో అర్థమైంది వీశెట్టికి.

—మాడుగుల పి. శ్రావణ్‌కుమార్



# పనస



పళ్ళలో కెల్లా చాలా పెద్దది పనసపండు. ఇది దాదాపు 90 సెం.మీ. పొడవూ, 40 సెం.మీ. లావూ వుంటుంది. పనసను తెలుగులో లాగే సంస్కృతంలోనూ, మరాఠీలోనూ పనస్, ఫనాస్ అని అంటారు. కొన్ని దక్షిణాది భాషలలో దీనిని 'చక్కా' అని అంటారు. ఆ 'చక్కా' నుంచే ఇంగ్లీషు 'జాక్' అనే మాట వచ్చి వుంటుందని భావిస్తున్నారు!

సుప్రసిద్ధ గ్రీకు చరిత్రకారుడు థియోఫ్రాటస్ (క్రీ.పూ. 300 సం॥) దీనిని గురించి — భారత దేశంలో సాధువులు తినే మధుర ఫలం. పెద్ద వృక్షాలలో కాచే పెద్ద పండు — అని రాశాడు. 14వ శతాబ్దానికి చెందిన ఇటలీ యాత్రికుడు మారిగ్ నొల్లీ పనసపండు పరిమాణం గొర్రెపిల్లంత వుంటుందని చెప్పాడు.

ఎప్పుడూ పచ్చగా వుండే పనస చెట్లు దాదాపు 15 మీ॥ ఎత్తు ఎదుగుతాయి. మనదేశంలోని పడమటి కనుమలకు చెందినవని చెప్పబడే ఈ చెట్లు ఉత్తరప్రదేశ్, అస్సాం, బీహార్ రాష్ట్రాలలో కూడా అక్కడక్కడా కనిపిస్తాయి. ముఖ్యంగా నీడ కోసం వీటిని పెంచుతారు. ఇసుకనేలలోని చెట్లు, రాతి నేల చెట్లకన్నా పెద్ద కాయలు కాస్తాయి.

వీటి పెద్ద పెద్ద ఆకులు పచ్చగానూ, గుండ్రంగానూ, దళసరిగానూ వుంటాయి. చలికాలం చివర పువ్వులు గుత్తులు గుత్తులుగా పూస్తాయి. పూలకు ఒరలాంటి దళసరి దళం రక్షణగా వుంటుంది. కాని, అది త్వరగా రాలిపోతుంది. ఆకులకు దూరంగా, కొమ్మల మొదళ్ళలోనూ, బోదెల వద్దా కాయలు కాస్తాయి. కాయలు పక్వానికి రాగానే మంచి వాసన వేస్తాయి. లేతగా వున్నప్పుడు పచ్చగానూ, ఆ తరవాత పసుపుగానూ, బాగా పండిన తరవాత ముదురు ఊదారంగుగానూమారతాయి. కోలగానూ, గుండ్రంగానూ వుండే పనస కాయలు 20-30 కి॥ గ్రా॥ వరకు బరువు వుంటాయి. పనస పండు పైతొక్క మందంగానూ పైన ముళ్ళుముళ్ళుగానూ వుంటుంది. తియ్యటి పనస తొనలలో తెల్లటి విత్తనాలు ఉంటాయి. పనస మామూలుగా మార్చ్ నుంచి జూన్ నెల వరకు కాపుకు వస్తుంది. రుతుపవనాలు ఆలస్యమయితే, సెప్టెంబర్ వరకూ పనసపళ్ళు లభిస్తాయి. పనసకాయలను కూర వండుకుని తినవచ్చు. పనస పండు చాలా రుచిగా వుంటుంది.

పనస కలపను తలుపులు, కిటికీలు, బీరువాలు మొదలైన వాటిని చేయడానికి ఉపయోగిస్తారు. పసుపు రంగులో వుండే కలప నల్లగా మారి, పాలిష్ చేసినట్టయితే నిగనిగలాడుతూ దేవదారు చెక్కలా కనిపిస్తుంది.




# ఖురాను

ఇస్లాం మత స్థాపకుడు మహమ్మదు ప్రవక్త అరేబియా నగరం మెక్కాలో క్రీ.శ.570 వ సం॥ లో జన్మించాడు. ఆయన చిన్నప్పుడు వ్యాపారం చేస్తూ, ఒంటెల మీద వివిధ ప్రాంతాలు తిరిగాడు. కాని అచిరకాలంలోనే — ప్రజలకు తనద్వారా సందేశం అందించడానికి భగవంతుడు సంకల్పించినట్టూ, తన కోసం ఒక మహత్తరకార్యం కాచుకుని ఉన్నట్టూ మహమ్మదు గ్రహించాడు. న్యాయపూరితమైన మతజీవనం గడపడానికి కావలసిన నైతిక సూక్తులను భగవంతుడి నుంచి పొంది, వాటిని మహమ్మదు ప్రజలకు తెలియజేశాడు. ఆ సూక్తులనే ఖురానులో పొందుపరిచారు.

ఇస్లాం అనే మాటకు (భగవంతుడికి) లోబడి వుండడం, శాంతి అని అర్థం చెబుతారు. అంటే, భగవంతుడికి లోబడి వుండడం ద్వారా శాంతిని పొందడం అని భావం. ఇస్లాం మత విశ్వాసం కల వారిని ముస్లింలు, మహమ్మదీయులు అని అంటారు.

ముస్లింల పవిత్రగ్రంథం ఖురాను. దేవుడు ఒక్కడే అన్న సిద్ధాంతాన్ని ఇది చాటుతుంది. భగవంతుడు సర్వవ్యాపకుడు. "తూర్పు, పడమర అల్లాకే చెందుతుంది. ఏ మార్గంలో వెళ్ళినా ఆయనను చేరుకుంటావు. ఆయన సర్వవ్యాపకుడు, సర్వజ్ఞుడు," అని ఖురాను ప్రబోధిస్తున్నది.

ఖురానులోని తొలి సూక్తిలోనే భగవంతుడికి లోబడి ఉండడం ప్రధానం అన్న విషయం ఇలా స్పష్టంగా చెప్పబడింది:

పరమ కరుణామయుడైన అల్లా పేరుతో —
అల్లాకు విజయం! అతడే అన్నిటికీ అధిపతి!
పరమకరుణామయుడు! దయామయుడు!
న్యాయనిర్ణయం చేసే నాటి అధికారి!
నిన్ను మాత్రమే మేము ప్రార్థిస్తున్నాము!
నిన్ను మాత్రమే సహాయం కోసం అర్థిస్తున్నాము!

మమ్మల్ని చక్కని మార్గం గుండా నడిపించు!
నిన్ను నమ్మి, నీ కరుణకు పాత్రులయిన వారు
నడిచిన మార్గంలో మమ్మల్ని నడిపించు!
నీకు అప్రీతిని కలిగించిన వారి మార్గంలో కాదు;
నిన్ను వదిలి వెళ్ళినవారి మార్గంలో కాదు!

జ్ఞానసముపార్జనకూ, న్యాయానికీ ఖురాను పెద్ద పీట వేస్తుంది. పుట్టినప్పటి నుంచి గిట్టే వరకు జ్ఞానసముపార్జన సాగిస్తూనే ఉండాలి — అంటుంది ఖురాను.

మన సమకాలీన ప్రముఖ భారతీయ పండితుడు అస్ఘర్ అలీ ఇంజనీరు ఇలా అన్నాడు : "ప్రపంచంలో ఏ మతంగాని ద్వేషాన్నీ, ఘర్షణనూ, దురభిమానాన్నీ రేకెత్తించడానికి ప్రయత్నించదు. నిజానికి ఇలాంటి రుగ్మతలను పోగొట్టడానికే మతాలు కావాలి. ప్రతి మతం కూడా విలక్షణమైన పద్ధతిలో ప్రేమనూ, న్యాయాన్నీ, శాంతినీ పెంపొందించడానికే కృషి చేస్తుంది. ఇస్లాం కూడా అదే చేస్తుంది. మెక్కా కఫర్ మీద, వారికి సహకరించిన వారి మీద హింసాత్మకమైన ప్రతిఘటనకు పూనుకోవాలనే కొన్ని సూక్తులు ఖురానులో ఉన్నాయి. ఈ సూక్తులను చారిత్రక సందర్భాన్ని బట్టి అర్థం చేసుకోవాలి. వాటిని అనుసరించడం ఆ సందర్భానికి మాత్రమే తగినది. అవి మిగతా వాటి లాగా సార్వకాలికాలుకావు!"



# మీకు తెలుసా?

1. స్వతంత్ర కెన్యా దేశానికి మొట్టమొదటి ప్రధానమంత్రి, అధ్యక్షుడు ఎవరు?
2. మనదేశంలో అతి పెద్ద నగరం ఏది?
3. మధ్యధరా సముద్రంలో త్రిభుజాకారంలో వున్న ద్వీపం ఏది?
4. ఇండొనేషియాలో వెయ్యిదేవాలయాల ద్వీపం అని పేరుగాంచిన ద్వీపం ఏది?
5. ప్రపంచంలోకెల్లా ఎత్తయిన దేశం ఏది?
6. మూడు గుండెలు గల జంతువు ఏది?
7. బెర్లిన్‌కుడ్య నిర్మాణం ఎప్పుడు జరిగింది? ఎప్పుడు పతనమయింది?
8. ఒక ఆగ్నేయాసియా దేశానికి 'అయోధ్య' రాజధానిగా ఉండేది. ఏదేశానికి?
9. అబ్రహాం లింకన్ భార్య పేరేమిటి?
10. ఇంగ్లాండును సంయుక్తంగా పాలించిన దంపతులు ఎవరు?
11. ప్రపంచంలో అత్యధిక జనాభా గల నగరం ఏది?
12. వాషింగ్టన్‌కు పూర్వం అమెరికా రాజధాని ఏది?
13. పళ్ళులేని జంతువు ఏది?
14. బార్సిలోనా స్పెయిన్‌లోని ఒక నగరం. ఇదే పేరుతో దక్షిణ అమెరికాలో ఒక పట్టణం ఉన్నది. అది ఎక్కడ ఉన్నది?
15. బంగాళా దుంపలు మొట్టమొదట ఎక్కడ పండేవి?
16. టాంజానియాలోని మాన్యారా నేషనల్ పార్క్‌లో ఆఫ్రికాకు చెందిన ఒక జంతువు అధిక సంఖ్యలో ఉన్నది. ఆ జంతువు ఏది?

## సమాధానాలు

1. జోమో కిన్యాటా.
2. కలకత్తా.
3. సిసిలీ.
4. బాలి.
5. స్విట్జర్లాండ్.
6. 'కటిల్ ఫిష్' అనే జలచరం.
7. 1961వ సం॥లో. 1989వ సం॥లో.
8. థాయ్‌లాండ్ (సియాం)
9. మేరీ టాడ్.
10. మూడవ విలియం; రెండవ మేరీ. (1689 - 1694).
11. చైనాలోని షాంఘాయ్.
12. ఫిలడెల్ఫియా.
13. చీమల్ని తినే 'యాంట్‌ఈటర్.'
14. వెనిజులా.
15. దక్షిణ అమెరికా.
16. ఏనుగు.



# భూమన్న భూదానం

వసంతవాడ అనే గ్రామంలో, భూమన్న అనే భాగ్యవంతుడుండేవాడు. ఆయనకు దాన కర్ణుడని పేరు. ఆపేరు నిలబెట్టుకోవడం కోసం, ముందు వెనకలు చూసుకోకుండా దాన ధర్మాలు చేసి ఆస్తిపాస్తులన్నీ పోగొట్టుకున్నాడు. ఆయన వ్యవసాయంలో మంచి దిట్ట. అందుచేత, ఇతరుల పొలాలు కౌలుకు చేస్తూ, పువ్వులమ్మిన ఊళ్ళోనే కట్టెలమ్మాడనిపించు కోకుండా, ఏ లోటూ లేని సుఖజీవనం చేస్తు న్నాడు. దానగుణం మాత్రం ఆయనను వదిలి పెట్టలేదు.

ఇలా వుండగా, ఒక రోజున భూమన్న ఇంటి అరుగు మీద కూర్చుని పురోహితుడితో మాట్లాడుతున్న సమయంలో, ఒక బ్రాహ్మ డక్కడికి వచ్చాడు. భూమన్న అతడికి గౌరవ పూర్వకంగా నమస్కరించి, పురోహితుడి పక్కన కూర్చోవలసిందిగా చెప్పి, వచ్చినపనేమిటని అడిగాడు.

అందుకు బ్రాహ్మడు, "అయ్యా! మీ గ్రామం లోని రత్నశెట్టి గారింటికి, వారమ్మాయి పెళ్ళికి వచ్చాను. పెళ్ళయిన ఐదవ రోజు నాగవల్లి నాడు శెట్టి కుటుంబీకులు, బ్రాహ్మణ పండి తుల కుటుంబాలు ఎక్కడున్నాయో వాకబు చేసి బహుమతులిస్తారు. దాన్ని నాకబలి అంటా రని మీకు తెలియంది కాదు! నేనిక్కడికి రెండా మడల దూరంలో వున్న వనస్థలి అగ్రహారంలో వుంటున్నాను. మా పూర్వీకుల కీశెట్టి వంశీ యులు, ఈ ఊళ్ళో నాకబలి పళ్ళాలు ఇచ్చే వారు. అందుచేత పిలవకపోయినా వంశా చారం కొద్దీ ఆ పళ్ళాల కోసం వచ్చాను. అయితే, శెట్టిగారు విసుక్కుంటూ ఇచ్చిన సంభావన చూశాక, ఆ పళ్ళాలంటే విరక్తి పుట్టింది. భవిష్యత్తులో వాటికోసం ఇక ఏనాడూ రాను. ఇంత దూరం వచ్చాం కదా అని ఈ గ్రామంలోనే వున్న దానకర్ణులు తమర్ని చూసి పోదామని ఇటు వచ్చాను," అన్నాడు.

జె. ఉదయనాగశిరీష



మునుముందు అతిత్వరలో చెల్లించగలిగే లాగా నన్ను మనసారా ఆశీర్వదించండి!" అని కోరాడు.

తాంబూలం తీసుకుని, దక్షిణను దుస్తుల్లో దాచుకుంటూ బ్రాహ్మడు, భూమన్నను అర చేతిని చాచమన్నాడు. తర్వాత దానిని నిశితం గాపరిశీలించి కళ్ళు పెద్దవి చేసి, "అయ్యా! దానరేఖ మీ చేతిలో స్పష్టంగా వుంది. మీరు జీవితకాలమంతా దానాలు చేస్తూనే వుంటారు. మీకు సొంత భూమి వుండడాన్ని రేఖలు స్పష్టంగా చూపిస్తున్నాయి. మీరు పురోహితుడికి చ్చిన వాగ్దానం వల్ల, ఇది కించిద్భోగం భవి ష్యతిని సూచించుతున్నదేమో అనుకుంటు న్నాను," అన్నాడు.

వెంటనే పురోహితుడు, "భూమన్నగారి వంటి దానకర్ణులు మాట తప్పరు. అందుచేత అయన భూమిని సంపాదించి నాకిచ్చినా ఆశ్చ ర్యపోనక్కరలేదు. కాని, ఆ భూమిని నేను స్వీకరిస్తే, యాచకవృత్తికే కళంకం తెచ్చిన వాడినవుతాను!" అన్నాడు.

ఆ తర్వాత కొంతకాలం గడిచింది. వసంత వాడను అనుకుని ప్రవహించే నదికి ఆనకట్ట కట్టారు. అందుచేత నదిలోని నీటిని చిన్న చిన్న కాలవలలోకి వెళ్ళేలా చేశారు. ఆ కారణంగా, నది నీటి మట్టం తగ్గి నదిలో అక్కడక్కడ మట్టి దిబ్బలు లేచాయి. అవి ఒకప్పుడు సాగులంక భూములు. వరదల వల్ల నదిలో నీటి మట్టం పెరిగి మునిగిపోయాయి.

ఈ మాటలకు భూమన్న చాలా సంతో షించి, ఇంట్లోకి పోయి తిరిగి వచ్చి, బ్రాహ్మడికి తాంబూలం, దక్షిణ ఇస్తూ చేతులు జోడించి, "శెట్టిగారింట్లో విలువ కోల్పోయి, కేవలం అనవాయితీగా మారిన నాకబలి పళ్ళాలలాగే, నేనుకూడా ఇప్పుడు పేరుకు మాత్రమే దాన కర్ణుణ్ణి. మా తల్లిగారు పోయినప్పుడు భూ దానం చెయ్యలేకపోయాను. పురోహితుల వారికి భూదానం పేరిట ఒక వరహా తాంబూ లంలో పెట్టి ఇచ్చి, భవిష్యత్తులో భూదానం చేస్తానని వాగ్దానం చేశాను. ఇటువంటి పరి స్థితుల్లో తమకు సంతృప్తికరంగా దక్షిణ ఇవ్వ లేకపోతున్నందుకు మన్నించండి. మా తల్లిగారి నిమిత్తమై పురోహితుల వారికిచ్చిన భూదానం

ఒకనాడు గ్రామ కరణం, భూమన్న ఇంటికి వచ్చి, "భూమన్నగారూ! అదృష్టం అంటే మీదే. నదిలో తేలిన సాగులంక దిబ్బలన్నీ, మా దగ్గరున్న లెక్కల ప్రకారం కొలిచి, ఏవి ఎవరికి చెందినవో గుర్తించాం. మా దగ్గరున్న ఆధారాల ఆధారంగా, మీ పూర్వీకుల కాలం నాడు నదిలో మునిగిపోయిన పదెకరాల భూమి ఇప్పుడు మీకు చెందుతుంది," అని చెప్పాడు.

ఇది విని, భూమన్న తిరిగి తనకు పట్టిన భాగ్యానికి ఆనందం పట్టలేకపోయాడు. కరణానికి మర్యాద చేసి కూర్చోబెట్టి, పురోహితుడికి కబురుపంపాడు.

పురోహితుడు వచ్చాడు. అప్పుడు భూమన్న, కరణంతో, "కరణంగారూ! నేను మా తల్లి పోయినప్పుడు వీరికి భూదానం వాగ్దానం చేశాను. చనిపోయేలోగా నెరవేర్చగలనా అని బెంగపడుతున్నాను. కించిద్భోగం భవిష్యతి లాంటి ఈ భూమిని, నా సొంతానికి వుంచుకోను. దయచేసి, మా పురోహితుల వారి పేరున రాయండి," అన్నాడు.

భూమన్న చేస్తున్న దానానికి పురోహితుడు కళవెళపడ్డాడు. ఆయనకు గతంలో పారుగూరి బ్రాహ్మడి ఎదట అన్న మాటలు గుర్తుకు వచ్చాయి. ఇప్పుడు తను భూమన్న దానాన్ని నిరాకరిస్తే ఆయన బాధపడతాడు. అందుచేత పురోహితుడు దానిని గురించి బాగా ఆలోచించి, "ఈ భూదానంతో పాటు మరొకదానాన్ని భూమన్నగారు ఇస్తేనే, నేనీ భూదానాన్ని స్వీకరిస్తాను," అన్నాడు.



ఈ మాటలకు కరణంతో పాటు భూమన్న కూడా ఆశ్చర్యపోయాడు. చివరికాయన చిరు నవ్వుతో, "అదేదో చెప్పండి!" అన్నాడు.

పురోహితుడు, కరణంకేసి తల తిప్పి, "ఈ భూమన్నగారు దానంలోనే కాదు వ్యవసాయం లోనూ, తనకు తానే సాటి అన్న సంగతి వాడ వాడలా తెలిసిందే! ఈయన భూదానంతో పాటు నాకు శ్రమ దానం కూడా ఇవ్వాలి. మహానదులు ప్రకృతి వైపరీత్యాల వల్ల పొంగి విజృంభించినప్పుడు కొండలే అడ్డుకాదు; మానవ నిర్మితాలైన ఆనకట్టలు ఏపాటి! అందువల్ల, ఈనాడు నీట తేలిన భూమి, రేపు తిరిగి నీట మునగ వచ్చు," అంటూ ఆగాడు.

ఇది విని భూమన్న, పురోహితుడికేసి ఆశ్చ ర్యంగా చూశాడు.

కరణం ఏదో అర్థమైన వాడిలా తలవూపి, "ఆమాటా నిజమే! ఆ శ్రమదానం సంగతే మిటో చెప్పండి," అని అడిగాడు.

పురోహితుడు వినయంగా ఒకసారి భూ మన్నకేసి తలవంచి, కరణంతో, "తమ దాన గుణంతో భూమన్నగారు దేహీ అన్నవారిని కరుణిస్తే, గంగామాత భూమన్న గారిని కరు ణించింది. అందువల్ల వారి పూర్వీకులదైన ఆ భూమిని చెరుపుతూ రాత కోత లేమీ చేయ కండి. అయితే, భూమన్నగారు ఆ భూమిని నాకు దానం ఇస్తున్నామన్నారు కనక, దానితో పాటు అందులో వ్యవసాయం చేసే శ్రమను కూడా దానం చేసి — నాకు మాత్రం ప్రతి ఫలంగా, వచ్చే పంటలో నాలుగో వంతు దానం చెయ్యమనండి," అన్నాడు.

కరణం, పురోహితుడికేసి మెచ్చుకుంటు న్నట్టు చూసి, భూమన్నతో, "ఏమంటారు, భూమన్న గారూ?" అన్నాడు.

"మా పురోహితులు చెప్పిన దాన్ని, నేనెలా కాదనగలను? అలాగే!" అన్నాడు భూమన్న తృప్తిగా.

ఆ తర్వాత ఆయన, పురోహితుడికి సాధ్య మైనంత ఎక్కువ ఇవ్వాలన్న పట్టుదలతో కష్టించి పనిచేసి, ఉన్నంతలో తన దాన గుణా నికి ఏమాత్రం లోటు రాకుండా సంతోషంగా జీవించాడు.



## ఈగలా? చీమలా?



టెక్సాస్ పౌరులకు ఇటీవల చీమల బెడద మరీ తీరని సమస్యగా తయారయింది. వాటిని నివారించడానికి రకరకాలుగా ప్రయత్నించారు. కాని, ప్రయోజనం లేకపోయింది. క్రిమికీటకాల మీద ప్రయోగించే మందులను కూడా ఉపయోగించారు. కాని, అవి కూడా చీమల మీద పని చేయలేదు. కొందరయితే, ఈ చీమల బాధ పడలేక ఇళ్ళు వదిలి పారిపోయే పరిస్థితి కూడా ఏర్పడింది. ఆఖరికి టెక్సాస్ విశ్వవిద్యాలయానికి చెందిన కొందరు విజ్ఞాన వేత్తలు బ్రెజిల్ నుంచి ఒక జాతి ఈగలను తెప్పించి, వాటి మీద వదిలారు. ఇవి చీమల తల మీద గుడ్లు పెడితే, గుడ్ల నుంచి వెలువడిన లార్వా, చీమలమెదడును తినివేయసాగాయి. దాంతో చీమల బెడద ఒక విధంగా తగ్గిపోయింది!



## నిలుపుకున్న మాట!

టీవీల ఉధృతం వల్ల పిల్లలలో చదివే అలవాటు రోజు రోజుకూ తగ్గిపోతున్నదని పెద్దలు వాపోవడం పరిపాటిఅయింది. ఇదినిజం కూడా. పిల్లలలో పఠనాసక్తిని పెంపొందించడానికి అమెరికాలో ఆర్.ఐ.ఎఫ్. అనే ఒక పథకాన్ని రూపొందించారు. పిల్లలలో మంచిపుస్తకాలు చదివేఅలవాటును పెంచడానికి కాలిఫోర్నియాకు చెందిన షెల్లీడిరాడో అనే ఒక ప్రాథమిక పాఠశాల ప్రధాన ఉపాధ్యాయిని విచిత్రమైన పద్ధతిని చేపట్టింది. విద్యార్థులు ఒక పుస్తకాన్ని పూర్తిగా చదివి నట్టయితే తాను ఒక మట్టిపామును మింగుతానని పిల్లలకు మాట ఇచ్చింది. పిల్లలు పట్టుదలతో ఆర్.ఐ.ఎఫ్. పథకం నిర్దేశించిన రెండు పుస్తకాలను చదివి పూర్తి చేశారు. మరునాడే ఉపాధ్యాయిని పిల్లలందరినీ ఒకచోట సమావేశపరచి, చెప్పినమాట ప్రకారం గ్లాసెడు నారింజ రసంతో రెండు మట్టిపాములను మింగేసింది!



# రామాపురం రామయ్య

రామాపురం రామయ్య, సీతాపురం సీతయ్యతో ఏదోపనిబడి, చీకటితోటే కాలినడకన బయలు దేరాడు. అతను లక్ష్మణాపురం చేరేసరికి మిట్ట మధ్యాహ్నమయింది. అతణ్ణి ఆకలి దహించి వేస్తున్నది. ఇక భోజనం చేస్తేగానీ లాభం లేదనుకుని, ఒక పెంకుటింటి ముందు ఆగాడు.

ఆ ఇంట్లో వాళ్ళందరికీ బ్రహ్మచెముడు. ఆ సంగతి తెలియని రామయ్య, వీధిఅరుగు మీద కూర్చున్న పాతికేళ్ళ యువకుణ్ణి, "బాబూ! మండుటెండన పడి వచ్చిన బాటసారిని. ఈ పూటకు మీ ఇంట్లో భోజనం పెడతారేమో, కనుక్కో! నీకు పుణ్యం వుంటుంది," అని, పైపంచతో విసురుకుంటూ అరుగు మీద కూర్చున్నాడు.

ఆ యువకుడు చరచరా లోపలికి వెళ్ళి, పెళ్ళీడుకొచ్చిన చెల్లెల్ని ఎడాపెడా తిడుతూ, "ఎవడే వాడు? ఏ వూరి వాడు? వాడిని పెళ్ళాడ తానన్నావట. వాడొచ్చి వీధి అరుగు మీద తిష్ఠ వేశాడు. ఈ సంగతి పదిమందికి తెలిస్తే ఎంత అప్రతిష్ఠ! ఎంత అప్రతిష్ఠ!" అంటూ నోరు నొక్కుకోసాగాడు.

అన్న మాటలు మరొకలాగా వినబడ్డ చెల్లెలు, తోక తొక్కిన తాచులా లేచి, విస విసా పెరట్లో చుట్ట కాల్చుకుంటున్న తండ్రి దగ్గరకు వెళ్ళి, "నాన్నా! ఇదెక్కడి ఘోరం! ఇదేం న్యాయం! ఆస్తిలో నాకు వాటా రాదంటున్నాడు అన్నయ్య. ఆమధ్య జమీందారు గారు, తండ్రి ఆస్తిలో కూతుళ్ళకు కూడా హక్కు వున్నదని చేసిన శాసనం, ఆ చెవిటి వెధవకు తెలిసినట్టు లేదు. ఏమనుకున్నాడేమో! నాకు వాటా లేదంటూ వాదుకు వచ్చాడో, జమీందారు గారికి చెప్పి, వాణ్ణి మిట్టమధ్యాహ్నపు రోహిణీకార్తె ఎండలో రచ్చ బండ దగ్గర నిలువునా కొరత వేయిస్తాను!" అన్నది.

మాచిరాజు కామేశ్వరరావు

ఆమె తండ్రి సగం తాగిన చుట్ట గిరవాటు వేసి, బావిలోంచి నీళ్ళు తోడుతున్న పెళ్ళాం వీపు మీద గట్టిగా చరిచి, "ఏమే మొద్దు మొహమా! అమ్మాయితో వంట చేయననీ, నన్ను పస్తులుంచుతాననీ అనడానికి నీకెంత పొగరు! నిన్నని ఏం లాభం? కూరలూ, పచ్చళ్ళ మాట దేవుడెరుగు, అసలు మీవంశంలో ఆడ వాళ్ళకు అన్నం వండడం కూడా రాదని, మా బామ్మ పెళ్ళి చూపుల్లో మొత్తుకుంటూ చెప్పింది. అయినా, ఆమె మాట వినకుండా నిన్ను కట్టుకున్నాను!" అంటూ చిందులు తొక్కడం ప్రారంభించాడు.

అతడి భార్య సగం తోడిన నీళ్ళ చేదను బావిలోనే వదిలేసి, ఘొల్లుమంటూ పోయి పత్తితో వత్తులు చేసుకుంటున్న అత్తగారితో, "ఏమత్తయ్యా, నీకిదేం బుద్ధి? నలభై ఏళ్ళు దాటి, రేపో మాపో అరవయ్యో పడిలో పడ బోయే నీ కొడుక్కు, రెండో పెళ్ళి చేసుకో మని పురెక్కిస్తావా? నీ కొడుకేమన్నా నవ మన్మథుడా, ముచ్చుపాలెం మిరాశీ దారా? నేనేం నోరూ వాయా లేని దానిననుకుంటు న్నావా? నా సంగతి మీకు తెలియదు. చూడు — నేనీ ఊరు పెద్దల్నే కాదు, ఏటవ తలున్న ఏడుగ్రామాల పెద్దల్ని కూడా రప్పించి, మీ ఇద్దర్నీ చింత బరికెలతో ఒళ్ళు హూనం చేయిస్తాను!" అన్నది శివం ఎత్తిన దానిలా చేతులాడిస్తూ.

ముసలావిడ ఖస్సుమంటూ చేతిలో వత్తుల్ని అలా గాలికి వదిలేసి, "ఆహాఁ, ఇంతకాలా నికి చెరువు గట్టు సోమిదేవమ్మ కూతుర్నని



పించావు గదే! అసలు నువ్వెవత్తెవే, ఈ ఇంట్లోంచి నన్ను పొమ్మనడానికి? ఇది మా ఆయన ఇల్లు, ఇప్పుడు నా కొడుకిల్లు, రేపు నా మనవడిల్లు! ఇదుగో, వినూ! మా మామ గారి ముత్తాత ఆది సూరన్నగారు కట్టిన, ఈ ఇంట్లో నా ప్రాణాలు గుటుక్కుమనేదాకా, ఈ ఇల్లు వదిలేదిలేదు!" అంటూ కొంగు నడుముకు బిగించి ఆయాసపడుతూ వూగి పోసాగింది.

ఇలా ఇంటిల్లిపాదీ ఒకరి మాట ఒకరికి అర్థం కాక గొడవ పడుతూ, ఎవరికి వారే గ్రామపెద్ద దగ్గరకు వెళ్ళే ఉద్దేశంతో బయటకు వచ్చారు.

అప్పటిదాకా ఓపిగ్గా అరుగు మీద కూర్చున్న రామాపురం రామయ్య, వాళ్ళను చూసి ఆనందంతో పొంగిపోతూ, "ఆహాఁ, ఎంత మర్యాద! ఎంత మన్నన! అతిథిని భోజనానికి పిలవడానికి ఇంతమంది రావాలా? మీ గ్రామం – పేరేమన్నారూ? అతిథి మర్యాదకు పెట్టింది పేరన్నది పురాణ ప్రసిద్ధి కదా!" అంటూ సంతోషంగా లేచి నిలబడ్డాడు.

ఇదిచూసి, కోపంలో వున్న ఇంటి పెద్ద భగ్గుమంటూ, "మా ఇంటి వ్యవహారాల్లో కల్పించుకోవడానికి నువ్వెవరివయ్యా? మేమేం పరాయివాళ్ళ మీదికి వెళ్ళలేదే! అంతా అయినవాళ్ళం గనక తిట్టుకుంటాం, కొట్టుకుంటాం. ఆ తరవాత కలుసుకుంటాం! పిలవని పేరంటంగా వచ్చి, మాకు బుద్ధులు చెప్పడానికి నువ్వేమన్నా – ఆమధ్య పెళ్ళాం బిడ్డల్ని వదిలి కాశీకి పారిపోయిన బుద్ధిరాజు భూషయ్యవా?" అంటూ గట్టిగా ఒక చిటికె వేశాడు.

దానితో రామయ్య బెంబేలుపడిపోతూ, "అయ్యా, బాబోయ్! ఒక్క పూట భోజనానికి పది రూపాయలా? అంత డబ్బే! నిజంగా అంత డబ్బే నా దగ్గరుంటే, నాకు ఆకలి వెయ్యదు, మీ ఇంటి అరుగు మీద కూర్చునే వాణ్ణే కాదు," అంటూ గబగబా అరుగు మీది నుంచి కిందికి గెంతి వీధి వెంట పరిగెత్త సాగాడు.

సంగతేమంటే – పాపం, ఈ రామాపురం రామయ్యకూ బ్రహ్మచెముడు!






నైమిశారణ్యంలో ఋషిగణాలుండేవి. ఆ ఋషులకు కులపతి శౌనక మహాముని. అయన ఒకప్పుడు పన్నెండేళ్ళ పాటు జరిగే సత్రయాగం చేశాడు. అనేక మంది మహా ఋషులు కలిసి ఆ యాగం చేస్తూండగా అక్కడికి రోమహర్షుడి కొడుకు ఉగ్రశ్రవసుడనే సూతుడు వచ్చాడు. సూతుడికి తెలియని పురాణగాథలు లేవు.

సూతుణ్ణి చూడగానే మునులందరూ అతనిచుట్టూ మూగి, "నువ్వు ఎక్కడినుంచి వస్తున్నావు? నువ్వు రావటం మాకెంతో సంతోషమయింది. నీనుంచి మేము ఎన్నో పుణ్య కథలు వినవచ్చు," అన్నారు.

సూతుడు వారితో, "మహర్షులారా, పరీక్షితుడి కొడుకు జనమేజయుడు గొప్ప సర్ప యాగం చేశాడు. ఆ సమయంలో వైశంపాయనుడు జనమేజయుడికి అద్భుతమైన భారత కథలను చెప్పాడు. ఆ కథలను రాసినవాడు వైశంపాయనుడి గురువైన వేదవ్యాసుడే. నేనా కథలన్నీ విని, యుద్ధం జరిగిన శమంతక పంచకమనే పుణ్య క్షేత్రానికి వెళ్ళి దర్శించి, అటునుంచి ఇలా వచ్చాను," అన్నాడు.

ఇంకేముందీ? వ్యాసుడు రచించిన మహాభారత కథలను తమకు చెప్పమని సూతుణ్ణి శౌనకాది మహామునులు ఎంతో కుతూహలంగా కోరారు.

సూతుడు వారితో ఇలా చెప్పాడు: భారత రచన ఎలా జరిగిందనుకున్నారు? కృష్ణద్వైపాయనుడనే పేరుగల వ్యాసుడు వేదాలను నాలుగుగా విభజించిన అనంతరం హిమాల

1. పరీక్షిత్తు శాపం



యాల మీద కొంతకాలం తపస్సు చేశాడు. ధృతరాష్ట్రుడి తరం వారంతా చనిపోయాక భారతం ఆలోచించాడు. అది లోకానికంతకూ పఠనీయంగా ఉండేటట్టు చేసే మార్గమేమిటా అని తీవ్రంగా ఆలోచిస్తూండగా ఆయనను చూడటానికి బ్రహ్మ వచ్చాడు. వ్యాసుడు బ్రహ్మకు భక్తితో ప్రణామం చేసి, కూర్చోబెట్టి, "దేవా, నేను వేదవేదాంగాల సారమంతా ఇమిడ్చి, భారతమనే ఇతిహాసాన్ని ఆలోచించాను. ప్రజలు దాన్ని చదివి ఆనందించేటట్టుగా లిఖించే వాడెవడూ కనబడడు," అన్నాడు.

"నాయనా, విఘ్నేశ్వరుణ్ణి మనసారా ప్రార్థించి, అతని ద్వారా నీ భారత ఇతిహాసాన్ని రాయించు," అని బ్రహ్మ, వ్యాసుడికి సలహా ఇచ్చాడు.

వ్యాసుడు ధ్యానించగా విఘ్నేశ్వరుడు వచ్చాడు. వ్యాసుడు కోరిన ప్రకారం ఆయన చెబుతూ ఉంటే విఘ్నేశ్వరుడు మహాభారతాన్ని లిఖించాడు.

దాన్ని దేవలోకంలో నారదుడూ, పితృలోకంలో దేవలుడనే అసితుడూ, గంధర్వాది లోకాలలో శుకుడూ ప్రచారం చేశారు. జనమేజయుడు సర్పయాగం చేసినప్పుడు వైశంపాయనుడు దానినే పఠించి, భూలోకంలో ప్రచారంలోకి తెచ్చాడు.

శౌనకాది మునులు ఈ విషయాలు విని ఎంతో సంతోషించి, "కౌరవ పాండవులు యుద్ధం చేసిన శమంతకపంచకం అనే క్షేత్రానికి ఆపేరు ఎలా వచ్చింది?" అని సూతుణ్ణి అడిగారు.

సూతుడు వారికి దానిని గురించి ఇలా చెప్పాడు:

త్రేతా, ద్వాపర యుగ సంధిలో రాజులు మితిమించిన అహంభావంతో మదించి, అధర్మమార్గాన సంచరిస్తూ ఉంటే పరశురాముడు వారిని ఇరవై ఒక్కసారి వెతికి వెతికి చంపి, వారి రక్తంతో అయిదు మడుగులు కల్పించి, ఆ మడుగులలో పితృ దేవతలకు తర్పణాలిచ్చాడు. పితృ దేవతలు సంతసించి ఆ మడుగులైదూ పుణ్యతీర్థమయ్యేటట్టు పరశురాముడికి వరమిచ్చారు. ఆ ప్రదేశంలోనే

అతి ఘోరమైన భారత యుద్ధం జరిగింది. ఆ కారణంగా శమంతకపంచకక్షేత్రానికి కురుక్షేత్రమనే పేరు వచ్చింది.

పరీక్షితుడి కొడుకైన జనమేజయుడు ఆ కురుక్షేత్రంలో, తన తమ్ములైన శ్రుతసేన, ఉగ్రసేన, భీమసేనుల సహాయంతో దీర్ఘమైన సత్రయాగం చేస్తున్నాడు. ఆ సమయంలో, సరమ అనే దేవతా శునకం కొడుకు సారమేయంఅనేది యజ్ఞవాటికలో తిరుగుతూంటే జనమేజయుడి తమ్ములు ఆ కుక్కను తరిమి కొట్టారు. అదివెళ్ళి తన తల్లి అయిన సరమతో చెప్పింది. "సాధువులూ, పేదలూ అయిన వారికి కీడు చేస్తే కట్టికుడపకపోదు," అని సరమ తిట్టింది.



సరమ తిట్టు శాపమై తగులుతుందేమోనని భయపడి జనమేజయుడు హస్తినాపురానికి తిరిగివచ్చి, శాంతికర్మలు చేయించటానికి పురోహితుడెవడైనా దొరుకుతాడా అని చూడసాగాడు.

ఒకసారి అతను అరణ్యంలో వేటాడబోగా, అక్కడ శ్రుతశ్రవుడి ఆశ్రమం కనబడింది. శ్రుతశ్రవుడికి సోమశ్రవుడనే కొడుకున్నట్టు తెలిసి, జనమేజయుడు, "మీ కుమారుణ్ణి నాకు పురోహితుడుగా ఇవ్వగలరా?" అని శ్రుతశ్రవుణ్ణి అడిగాడు.

"నా కొడుకుకు ఒక నియమమున్నది. బ్రాహ్మణుడైనవాడు ఏది అడిగినా నా కొడుకు ఇచ్చేస్తాడు. అతని ఈ నియమానికి భంగం రాకుండా నువ్వు చూసే పక్షంలో, అతను నీకు పురోహితుడుగా ఉంటాడు," అన్నాడు శ్రుతశ్రవుడు.

జనమేజయుడు అందుకు సమ్మతించి, సోమశ్రవుణ్ణి తనవెంట హస్తినాపురానికి తీసుకుపోయి, అతని సహాయంతో అనేక యజ్ఞాలు చేశాడు.

ఇలా ఉండగా ఒకనాడు జనమేజయుడి వద్దకు ఉదంకుడనే ఒక మహర్షి వచ్చి, "రాజా, నువ్వు చెయ్యవలసిన పని ఉపేక్షించి, చేతులు కట్టుకు ఇలా కూర్చున్నావేమిటి?" అన్నాడు.

"స్వామీ, క్షత్రియ ధర్మాలన్నీ తప్పకుండా ఆచరిస్తున్నానే? ఏమిటి నేను చెయ్యక



మానినది?" అని జయమేజయుడు ఉదం కుణ్ణి అడిగాడు.

"సర్పయాగం చెయ్యి. ఆ దుర్మార్గుడు తక్షకుణ్ణి వెంటనే బూడిద చెయ్యి. మీ తండ్రి అయిన పరీక్షిత్తును కాటు వేసి చంపింది దుష్టుడయిన ఆ తక్షకుడు కాదూ? మీ తండ్రి ప్రాణాలను రక్షించటానికి వచ్చే కాశ్యపుడికి అంతులేని ధనాన్ని లంచం పెట్టి, తిప్పి పంపివేసినదీ వాడేగా?" అన్నాడు ఉదంకుడు ఆవేశంగా.

నిజానికి ఉదంకుడికి కూడా తక్షకుడిపైన చాలా పగ ఉన్నది. దానికి కారణం ఇది:

ఈ ఉదంకుడు వేదుడనే ఋషి దగ్గర చదువుకుని గృహస్థాశ్రమంలో ప్రవేశించబోతూ, తన గురువును గురుదక్షిణ ఏమి ఇవ్వమంటారని అడిగాడు.

"నా భార్య ఏమి కోరుతుందో అడిగి చూడు," అన్నాడు వేదుడు.

ఉదంకుడు గురుపత్నిని ఏమి కావాలని అడిగాడు.

"ఇవాళకు నాలుగో రోజున నేను పుణ్యక వ్రతం చేసుకుంటాను. అప్పుడు కుండలాలు పెట్టుకోవాలని ఉన్నది. నేను కోరే కుండలాలు పౌష్యుడనే రాజు భార్య వద్ద ఉన్నాయి. చాతనయితే వాటిని తెచ్చి ఇయ్యి," అన్నది గురుపత్ని.

ఉదంకుడు పౌష్యరాజు భార్య వద్దకు పోయి సంగతి చెప్పాడు.

ఆమె తన కుండలాలు ఇవ్వటానికి ఒప్పుకున్నది. కాని వాటిని తస్కరించటానికి తక్షకుడు ఎల్లప్పుడూ ఎదురు చూస్తున్నాడని హెచ్చరించింది.

ఆమె అన్నట్టే జరిగింది. ఉదంకుడు ఆ కుండలాలు తీసుకుని అరణ్యమార్గాన పోతూ, ఒకచోట మడుగు చూసి, కుండలాలను ఒకచోట పెట్టి, ఆచమించటానికి మడుగు దగ్గిరికి పోయేసరికి, అప్పటిదాకా ఉదంకుణ్ణి దూరదూరంగా రహస్యంగా వెన్నాడుతూ వచ్చిన తక్షకుడు ఆ కుండలాలను హరించి పారిపోసాగాడు.

నగ్న మానవ రూపంలో ఉన్న తక్షకుణ్ణి ఉదంకుడు తరిమి పట్టుకున్నాడు. వెంటనే

తక్షకుడు పాముగా మారి ఒక బిలంలో దూరాడు.

ఉదంకుడు ఆ బిలాన్ని ఒక కర్రతో తవ్వి పెద్దది చేస్తూ, ఆ మార్గాన పాతాళానికి చేరుకున్నాడు.

అక్కడ ఉన్న నాగులను ఉదంకుడు ఎంత స్తోత్రం చేసినా లాభం లేకపోయింది. చివరకు అతనికి ఒక గుర్రం మీద కూర్చుని ఉన్న ఒక మనిషి కనిపించాడు. ఆ గుర్రం అగ్ని, దానిమీద ఉన్నవాడు ఇంద్రుడు. ఆ సంగతి ఉదంకుడికి తెలియదు. అయినా, ఆ మనిషి తనను, "నీకేం కావాలి?" అని అడిగితే, ఉదంకుడు నాగలోకాన్ని తనకు అధీనం చెయ్యమన్నాడు. వెంటనే ఆ గుర్రం నుంచి భయంకరమైన అగ్నిజ్వాలలు వెలువడ్డాయి. నాగలోకమంతా బూడిద అయిపోతుందని భయపడి, తక్షకుడు కుండలాలను తెచ్చి ఉదంకుడికి ఇచ్చాడు. అతను వాటిని సకాలంలో గురుపత్నికి అందజేశాడు.

ఉదంకుడి ద్వారా తన తండ్రిని చంపినది తక్షకుడని తెలియగానే, జనమేజయుడు తన మంత్రులను, "అలా జరగటానికి కారణమేమిటి?" అని అడిగాడు.

వాళ్ళు పరీక్షిత్తు మరణవృత్తాంతం ఇలా చెప్పారు:

భారత యుద్ధంలో చనిపోయిన అభిమన్యుడికీ, ఉత్తరకూ పుట్టిన పరీక్షిత్తు కృపాచార్యుడి వద్ద విలువిద్య నేర్చి, పాండవుల అనంతరం రాజ్యపాలన చేస్తూ వచ్చాడు. ఆయనకు వేట అంటే చాలా ఇష్టం. ఒక



నాడాయన వేట తమకంలో అరణ్యంలో తనచేత దెబ్బతిని పారిపోయే జంతువును తరుముకుంటూ, శమీకుడనే మహాముని తపస్సు చేసుకుంటున్న చోటికి వచ్చి, "బాణం తగిలిన మృగం ఇటుగా పరిగెత్తుకుంటూ వచ్చింది. అది ఎటుగా పోయింది?" అని అడిగాడు.

మౌనంగా తపస్సు చేసుకునే శమీకుడు సమాధానం చెప్పలేదు. పరీక్షిత్తుకు కోపం వచ్చింది.

అతను ఒక చచ్చిన పామును బాణం ములికితో ఎత్తి శమీకుడి మెడలో వేసి వెళ్ళి పోయాడు.



శమీకుడి కొడుకైన శృంగికి ఒక మిత్రుడి ద్వారా పరీక్షిత్తు చేసిన పని గురించి తెలిసింది. ముక్కోపి అయిన శృంగి, పట్టరాని కోపంతో, "ఇవాళకు ఏడో రోజున పరీక్షిత్తు తక్షకుడి విషంతో చచ్చిపోవుగాక!" అని శాపం ఇచ్చాడు.

తన కొడుకు పరీక్షిత్తులాటి మంచి రాజుకు ఇంత దారుణమైన శాపం ఇచ్చాడని తెలిసి శమీకుడు చాలా నొచ్చుకుని, గౌరముఖుడనే తన శిష్యుణ్ణి పిలిచి, "నువ్వు పరీక్షిత్తు వద్దకు వెళ్ళి, శాపం సంగతి చెప్పి, తక్షకుడి వల్ల అపాయం రాకుండా జాగ్రత్తపడమని చెప్పు," అన్నాడు.

గౌరముఖుడు పరీక్షిత్తు వద్దకు వెళ్ళి, గురువుగారు చెప్పమన్నట్టే చెప్పాడు. పరీక్షిత్తు తాను చేసిన పనికి నొచ్చుకుని, శృంగి ఇచ్చిన శాపానికి భయపడి, శాపం తగలకుండా ఏదైనా ఉపాయం చూడమని మంత్రులను కోరాడు. వాళ్ళు ఒక ఒంటి స్తంభం మేడ కట్టించారు. అందులోకి బయటి గాలి కూడా పోవటానికి లేదు. మేడ నిండా విషాలకు విరుగుడుగా పనిచేసే ఔషధాలను ఉంచారు. విష వైద్యులనూ, మంత్రసిద్ధులనూ పిలిపించారు. రాజుతో సహా మంత్రులందరూ ఆ మేడలోనే చేరారు.

ఆరు రోజులు ఏ ప్రమాదమూ లేకుండా గడిచాయి. ఏడో రోజున కాశ్యపుడనే బ్రాహ్మణుడు పరీక్షిత్తుకు కలిగిన శాపం గురించి విని, తక్షకుడు కరిచిన పక్షంలో రాజు ప్రాణాలను కాపాడటానికి బయలుదేరి వస్తు

న్నాడు. తక్షకుడు కూడా రాజును కరవటానికి మార్గమేదా అని తీవ్రంగా ఆలోచిస్తూ, బ్రాహ్మణ వేషంలో వస్తూ కాశ్యపుణ్ణి కలుసుకున్నాడు. నేర్పుగా అతను వెళ్ళే పని తెలుసుకున్నాడు.

కాశ్యపుడు తక్షకుడితో, "నాకు పాముల విషానికి విరుగుడు తెలుసును. నా మంత్ర శక్తితో, పాములచేత చచ్చినవారిని క్షణాలలో బతికించగలను. రాజును తక్షకుడు కరిచే పక్షంలో ఆయనను బతికించితే, నాకు బోలెడంత ధనమూ, కీర్తీ లభిస్తుంది," అన్నాడు.

"అయ్యా, నేనే తక్షకుణ్ణి. నా విషంతో చచ్చినవారు బూడిద అయిపోతారు. నీ మంత్రాలతో తిరిగి బతకరు. నువ్వు తిరిగి వెళ్ళు," అన్నాడు తక్షకుడు.

కాశ్యపుడు ఒప్పుకోలేదు. తక్షకుడు సమీపంలో ఉన్న మర్రిచెట్టును కాటువేసి, తన విషాగ్నితో దాన్ని బూడిద చేసేశాడు. వెంటనే కాశ్యపుడు తన మంత్రంతో దాన్ని ఎప్పటిలాగా చేశాడు.

"నా విషానికి విరుగుడు వెయ్యగలవేమో గాని, మునికుమారుడి శాపానికి విరుగుడు వెయ్యగలవా? రాజు ఇచ్చే ధనం కంటే చాలా హెచ్చు ధనమిస్తాను. తీసుకుని వెళ్ళిపో," అని తక్షకుడు కాశ్యపుణ్ణి లోభపెట్టి, డబ్బిచ్చి పంపేశాడు.

తరవాత తక్షకుడు కొందరు నాగులను మునికుమారుల రూపంలో పరీక్షిత్తు వద్దకు పంపాడు.

వాళ్ళు, ఫలాలు, పుష్పాలతో పరీక్షిత్తు వద్దకు వెళ్ళారు. వాళ్ళిచ్చిన ఫలాలలో ఒకదాన్ని పరీక్షిత్తు పగల దీశాడు. అందులో చిన్న పురుగు కనబడింది.

పరీక్షిత్తు తనచుట్టూ ఉన్నవారితో, "శాపకాలం ముగుస్తున్నది. సూర్యాస్తమయం కావస్తున్నది. నన్ను కరిస్తే ఈ పురుగు కరవాలిగాని, సర్ప భయం లేదు," అన్నాడు. అంతలోనే ఆ పురుగు తక్షకుడై పరీక్షిత్తును కరిచాడు. అందరూ భయంతో చెల్లాచెదురుగా పారిపోయారు.

తక్షకుడి కాటుకు పరీక్షిత్తు తగలబడిపోవటమే గాక, ఒంటి స్తంభం మేడ నిలువునా మండింది!






త్రిరూపదేశపు యువరాణి చంద్రమతి అద్భుత సౌందర్యవతి. ఒకసారి ఆమె వింతలూ, విశేషాలూ చూసేందుకు పొరుగునే వున్న విరూప దేశానికి వెళ్ళింది. ఆ దేశపు యువరాజు వీరసేనుడామెకు స్వయంగా సకల మర్యాదలూ చేసి, వెంట వుండి వింతలూ, అద్భుతమనిపించే ప్రదేశాలూ చూపించాడు. ఆ సందర్భంలో వారిరువురికీ ఒకరి పట్ల ఒకరికి ప్రేమానురాగాలు కలిగినై.

చంద్రమతి త్రిరూపదేశానికి తిరిగి వెళ్ళిన కొద్ది దినాలకు, ఆమె తండ్రి నుంచి వీరసేనుడికి స్వయంవరానికి రావలసిందిగా ఆహ్వానం వచ్చింది.అతడు స్వయంవరోత్సాహంతో ప్రయాణానికి కావలసిన సకల సన్నాహాలూ చేసుకుంటూండగా ఒక ఘోరం జరిగిపోయింది.

ఘోరకుడనే రాక్షసుడు మహాబలవంతుడు; మంత్రవేత్త. వాడు కాలారణ్యంలో నివాసం ఏర్పరచుకుని వుంటున్నాడు. ఆ అరణ్యంలో అడుగుపెట్టిన వారెవ్వరూ ప్రాణాలతో బయట పడలేదు. ఆరాక్షసుడిప్పుడు చంద్రమతిని అపహరించి కాలారణ్యానికి తీసుకుపోయాడు. త్రిరూపరాజు కూతురుపైబెంగతో మంచంపట్టాడు.

మామూలుగా అయితే వీరసేనుడు, ఘోరకుడి వంటి రాక్షసుడితో తలపడే సాహసం చేసేవాడు కాదు. కానీ ఇప్పుడు చంద్రమతిపై ప్రేమకారణంగా, ఆమె లేనిదే బ్రతకడం వృధా అన్న ఆవేదన అతడికి కలిగింది. తల్లిదండ్రులు వారిస్తున్నా వినకుండా అతడు బయల్దేరి కాలారణ్యం చేరుకున్నాడు. అక్కడ అతడికి కొందరు రాజకుమారులు కనిపించారు.

జొన్నలగడ్డ రామలక్ష్మి



ఆ రాజకుమారులు చంద్రమతిని, రాక్షసుడి నుంచి విడిపించాలని కాలారణ్యంలో అడుగు పెట్టిన వాళ్ళు. వారిని ఘోరకుడు అవలీలగా బంధించి బల్లులుగానూ, కప్పలుగానూ, కొంగలుగానూ మార్చి, వాళ్ళతో, "మీరిక్కడి నుంచి వెంటనే బయల్దేరి అరణ్యం నుంచి బయటపడితే, యథా రూపాలు వస్తాయి. లేదా మీ ఆయువు మీమీ రూపాలకు అనుగుణంగా తగ్గిపోతుంది. అనుక్షణం విపరతమైన ప్రాణభయంతో కుమిలిపోతూంటారు," అన్నాడు.

వాళ్ళు వెంటనే అరణ్యం నుంచి బయలుదేరారు. కొందరు పాములకు ఆహారం అయ్యారు. కొందరు అరణ్య జంతువుల కాళ్ళ కింద నలిగిపోయారు. మరి కొందరు బోయవాళ్ళ వలలలో చిక్కుకున్నారు. మిగిలిన వాళ్ళు అరణ్యం దాటి యథారూపాలు పొందారు. వాళ్ళా అరణ్య సమీపంలోనే ఏడాది పాటు వుండి, మరే రాజకుమారులూ అరణ్యంలోకి ప్రవేశించకుండా హెచ్చరించమని రాక్షసుడి ఆజ్ఞ!

వాళ్ళు వీరసేనుడితో, "ఘోరకుడి నెదిరించే శక్తి ఈ భూమ్మీది ఎవరికీ లేదు. బ్రతికుంటే బలుసాకు తినవచ్చు. చంద్రమతిని గురించి మరిచిపోవడం మంచిది," అని ఏక కంఠంతో హెచ్చరించారు.

దానికి వీరసేనుడు, "మీకూ నాకూ ఒక ముఖ్యమైన తేడా వుంది. బ్రతికుంటే బలుసాకు తినవచ్చునని మీరనుకుంటున్నారు. చంద్రమతి లేనిదే బ్రతుకే అక్కర్లేదు నాకు. కాబట్టి నేను ఘోరకుడి వద్దకు వెళుతున్నాను," అంటూ ముందుకు వెళ్ళి కాలారణ్యంలో ప్రవేశించాడు.

ఆ అరణ్యం ఆకాశాన్నంటే మహా వృక్షాలతో, నిలువెత్తు ముళ్ళపొదలతో భయంకరంగా వుంది. అయితే, వీరసేనుడు ఎంతో దూరం వెళ్ళవలసిన అవసరం లేకపోయింది. ఉన్నట్టుండి ఎవరో వెనక నుంచి అతడి కళ్ళు మూసినట్టయింది. వీరసేనుడు గింజుకున్నాడు. అతడి కళ్ళకున్న అడ్డం తొలిగేంతలో ఎదురుగా ఒక మహాకాయుడు కనిపించాడు. వాడి కళ్ళు కణకణలాడే చింత నిప్పుల్లా

వున్నాయి. జుట్టు చిన్న ముళ్ళ పొదలా వుంది. "నా పేరు ఘోరకుడు. అరణ్యం బయటరా కుమారులు నిన్ను హెచ్చరించే వుండాలి. అయినా, లోపలికి వచ్చిన నీసాహసాన్ని మెచ్చక తప్పదు. నన్ను చంపగలననేనా నీ ధైర్యం!" అంటూ నవ్వాడు వాడు.

అందుకు వీరసేనుడు నిబ్బరంగా, "నేను నిన్ను చంపాలని రాలేదు. నేను ప్రేమించిన చంద్రమతిని దక్కించుకోవాలని వచ్చాను," అన్నాడు.

"నీ ప్రేమ నీ ప్రాణాలు తీస్తుంది. మర్యాదగా ఇక్కణ్ణించి వెళ్ళిపో. నిన్నేమీ చెయ్యను," అన్నాడు ఘోరకుడు.

"నాకు నా చంద్రమతి కావాలి. ఆమె లభించని పక్షంలో ప్రాణాలక్కర్లేదు," అన్నాడు వీరసేనుడు. ఘోరకుడు, వీరసేనుడి కేసి మెచ్చుకుంటూన్నట్టు చూసి, "అయితే చంద్రమతి నీకు దక్కే ఉపాయం చెప్పగలను. అందుకు నువ్వు సలసలకాగుతున్న నూనెలో స్నానం చేయాలి. అందుకుసిద్ధమయితే చెప్పు. లేదా నిన్ను కప్పగా మార్చి విడిచి పెడతాను. ఏ పాముకో ఆహారమయ్యేలోగా గెంతుకుంటూవెళ్ళి అరణ్యం నుంచి బయటపడితే, అటు పిమ్మట నీకు యథా రూపం వస్తుంది," అన్నాడు.

"నేను సలసలకాగే నూనెలో స్నానం చేస్తాను," అన్నాడు వీరసేనుడు.

ఘోరకుడతణ్ణి అరచేతిలోకి తీసుకుని బయల్దేరాడు. ఒకచోట గాడిపొయ్యి ఒకటి భగభగమండుతున్నది. దాని మీద ఒక పెద్ద





రాగి గుండిగ వున్నది. అందులో కాగుతున్న నూనె నుంచి వెచ్చని ఆవిర్లు వస్తున్నవి. ఘోరకుడు, వీరసేనుణ్ణి దాని మీదికి తీసుకుపోయాడు. అప్పుడు వీరసేనుడు గుండిగలో సలసల మరుగుతున్న నూనెను చూశాడు.

"మరొకసారి ఆలోచించుకో! ఇది నీవల్ల అవుతుందా — లేక కప్పగా మారి తిరిగిపోతావా?" అని అడిగాడు ఘోరకుడు.

"నేను ముందే చెప్పాను. నా మాటకు తిరుగులేదు," అన్నాడు వీరసేనుడు.

ఘోరకుడు చప్పున వీరసేనుణ్ణి గుండిగలో కిజారవిడిచాడు. అంతే! అతడి శరీరమంతా ఒక్కసారిగా బొబ్బలెక్కిపోయింది. భరించలేని బాధతో అతడు కెవ్వుమని అరిచాడు.

ఏమాత్రం చలించకుండా ఘోరకుడు గుండిగలోకి చూడసాగాడు. వీరసేనుడు ఆ గుండిగలో బెండకాయలా మునకలు వేస్తూ, చివరకు నిర్జీవుడిలా పైకి తేలాడు. అప్పుడు ఘోరకుడు ఏదో మంత్రం ఉచ్చరించాడు. వెంటనే మండుతున్న పొయ్యి, గుండిగ మాయమై, ఎప్పటి రూపంలో వీరసేనుడక్కడ కనిపించాడు.

ఘోరకుడు తృప్తిగా తలాడిస్తూ, "నీ ప్రాణాలు పోలేదు! కానీ ప్రాణాంతకమైన ఇలాంటి వేడి నూనె స్నానం వరసగా మూడు రోజులు చేశాకనే, నీకు చంద్రమతి లభించే ఉపాయం చెబుతాను, అందుకు సిద్ధపడితే సరేసరి? లేదా — ఇంకా సమయముంది, కప్పగా మారి గెంతుకుంటూ తిరిగిపోవచ్చు," అన్నాడు.

"నాకు చంద్రమతి లభించే ఉపాయం కావాలి!" అన్నాడు వీరసేనుడు దృఢ నిశ్చయంతో.

ఘోరకుడతణ్ణి మెచ్చుకుని, "రాజకుమారా! ఇంతవరకూ ఏ రాజకుమారుడూ చేయని సాహసం చేశావు. నీ ప్రేమ గొడవ ఏమిటో నాకర్థం కావడం లేదు, కానీ అది నిశ్చయంగా గొప్పదయి వుండాలి! సరే! నేనిప్పుడే నీకు చంద్రమతి దక్కే ఉపాయం చెప్పదలుచుకున్నాను. శ్రద్ధగా విను!" అన్నాడు.

కాలారణ్యంలోనే మరొక చోట ఘోరకి అనే రాక్షసి వున్నది. బలపరాక్రమాల్లో, శక్తి యుక్తుల్లో అది ఘోరకుడికి సాటి వస్తుంది.

దాని వద్ద అద్భుతమైన కుంకం వున్నది. దాన్ని ఘోరకుడికి తెచ్చి ఇస్తే, వాడు చంద్రమతిని విడిచిపెడతాడు.

"ఆ కుంకంలోని విశేషమేమిటి? నీవల్ల కాని ఈ పనిని నేను చేయగలనా?" అని అడిగాడు వీరసేనుడు.

"అయితే విను!" అని ఘోరకుడు ఒకక్షణం ఆగి, "నా వద్ద ఒక అద్భుతమైన భరిణ వున్నది. దానిలో ఆ కుంకం పోసి దగ్గర వుంచుకుంటే, ఈ ప్రపంచంలోని ఏ శక్తీ నా ముందు నిలువలేదు. ఆఖరుకు ఘోరకి కూడా నాకు తలవంచి తీరవలసిందే! ఘోరకి నుంచి ఆ కుంకాన్ని సంపాయించడం తేలిక కాదు. అసలు దాని నివాసంలో ప్రవేశించడమే సామాన్యులకు అసాధ్యం. మరుగుతున్న నూనెలో బాధకోర్చి స్నానం చేయగలవాడు మాత్రమే ఘోరకి నివాసంలో ప్రవేశించగలడు. ఇన్ని శక్తులున్నా నేను నా శరీరాన్ని అటువంటి బాధకు గురిచేసే సాహసం చేయలేకపోయాను. అలాంటి సాహసం చేయగల వీర యువకుడు లభిస్తాడనే, చంద్రమతిని అపహరించి తెచ్చాను. ఇప్పుడు చెప్పు, నువ్వు ఘోరకి నివాసంలో ప్రవేశించి నాకు కుంకం తెచ్చిపెడతావా?" అని ప్రశ్నించాడు.

"నా ప్రయత్నం నేను చేస్తాను," అన్నాడు వీరసేనుడు.

"రాత్రి పూట తన శయనగుహలో మానవాకారంలో నిద్రపోతుంది ఘోరకి. ఆ సమయంలో నిన్ను అక్కడ ప్రవేశపెడతాను. నేను నీకిచ్చే మూలికను నువ్వు దాని నుదిటి మీద





వుంచు. అది ప్రాణాలు విడుస్తుంది. కుంకం అది పడుకున్న మంచం మీది తలగడ కింద వుంటుంది," అని చెప్పాడు ఘోరకుడు.

వీరసేనుడు, ఘోరకుడిచ్చిన మూలిక తీసుకుని తన దుస్తుల్లో భద్రపరుచుకున్నాడు. తర్వాత ఘోరకుడు చెప్పినట్లు కళ్ళు మూసుకున్నాడు. క్షణం ఆగి కళ్ళు తెరిచేసరికి అతడొక విచిత్రమైన మంచం పక్కన వున్నాడు. దాని మీద అతి సామాన్యమైన అందచందాలు గల ఒక మానవ కాంత ఆదమరిచి నిద్రపోతున్నది. ఆమెను ఘోరకిగా ఊహించాడు వీరసేనుడు.

అతడికి దుస్తుల్లోని మూలిక గుర్తువచ్చింది. అయితే, ఉత్త పుణ్యాన ఘోరకిని చంపడానికి అతడికి మనస్కరించలేదు. క్షణం తటపటాయించి, చివరకు అతడామెను పాదాల వద్ద తట్టి నిద్రలేపాడు.

ఘోరకి హుంకరిస్తూ లేచి, "ఎవరు నువ్వు? గాలి చొరడానిక్కూడా వీలుకాని నా నివాసంలోకి ఎలా ప్రవేశించగలిగావు?" అన్నది.

వీరసేనుడామెకు తన కథ చెప్పి, "తలుచుకుంటే నీ ప్రాణాలు తీయగలిగి వుండేవాణ్ణి. కానీ అలా చెయ్యలేదు. ఒకరకంగా నేను నీ ప్రాణదాతను. ప్రత్యుపకారంగా నాకు కుంకాన్నివ్వు," అన్నాడు.

ఘోరకి అతడి దయాగుణాన్ని మెచ్చుకుని, "రాజకుమారా! ఈ కుంకాన్ని నీకిస్తే నువ్వు దాన్ని ఘోరకుడికిస్తావు. అప్పుడు వాడు నన్ను తనకు బానిసగా చేసుకుంటాడు. కాబట్టి నువ్వు నాకొక సాయం చెయ్యి. నేనూ నీకొక మూలికనిస్తాను. రాత్రి వాడు మానవరూపంలో నిద్రించే సమయంలో, దాని సాయంతో వాణ్ణి చంపి భరిణెను నాకు తెచ్చివ్వు. నీకు చంద్రమతి దక్కుతుంది. ఈ ప్రపంచంలో ఎవ్వరూ ఎదిరించలేని, ఈ ఘోరకి సాయం కూడా నీకు కావాలనుకున్నప్పుడల్లా లభిస్తుంది," అన్నది.

వీరసేనుడు తల అడ్డంగా వూపి, "ఈ సృష్టిలో స్త్రీ పురుషులకు పరస్పరం తోడు కావాలి. మీరిద్దరూ వివాహమాడితే ఎవరి సాయమూ అక్కర్లేకుండానే మహాశక్తిమంతులవుతారు. చంద్రమతిపై ప్రేమతో నేను సలసలకాగే నూనెలో స్నానం చేశాను. నువ్వు

ఘోరకుణ్ణి ప్రేమించి ఈ కుంకాన్ని త్యాగం చెయ్యి. నీ శక్తులను మించాలని ప్రయత్నించే ఘోరకుడు, నీ ప్రేమకు మాత్రం లొంగే వుంటాడు!" అన్నాడు.

ఘోరకికి అతడి మాటలు నిజమనిపించాయి. అది తలగడ క్రింద వున్న కుంకం పొట్లాన్ని వీరసేనుడికిచ్చి, "నేను ఘోరకుణ్ణి పెళ్ళాడ దలిచాను. అతడికిది నా కానుక!" అన్నది.

వీరసేనుడు, ఘోరకుడి వద్దకు తిరిగివెళ్ళి జరిగిందంతా చెప్పి, "నువ్వు ఘోరకిని పెళ్ళాడటంలోనే సౌఖ్యముంటుంది. ఎన్ని శక్తులు సంపాదించినా నిన్నవి సుఖపెట్టవు!" అన్నాడు.

తనకు ఘోరకి కుంకాన్ని పెళ్ళి కానుకగా పంపిందని తెలియగానే, ఘోరకుడికి ఎక్కడ లేని ఆనందం కలిగింది. వాడు వెంటనే చంద్రమతిని వీరసేనుడి కప్పగించి, అరణ్యం బయటవదిలి పెట్టాడు.

అక్కడ వున్న రాజకుమారులు జరిగింది తెలుసుకుని, "ఘోరకుడు, ఘోరకి పరమ దుష్టులు. కుంకం, భరిణె ఒక చోటుకు చేరడం వల్ల ప్రపంచానికి మరింత ప్రమాదం. అవకాశం వచ్చినప్పుడు తెలివిగా వాళ్ళను చంపక, నీ స్వార్థం నువ్వు చూసుకున్నావు!" అంటూ వీరసేనుణ్ణి నిందించారు.

ఇందుకు వీరసేనుడు నవ్వి, "ప్రేమకు ద్వేషం తెలియదు. ఒక్క చంద్రమతి విషయంలోతప్ప ఘోరకుడు ప్రపంచానికి ప్రమాదం తలపెట్టినట్టు నిదర్శనాలు లేవు! నా విషయంలో వాడి ఔదార్యం చూశారు గదా? ఘోరకుడు చెప్పేవరకూ ఘోరకి గురించి మనకు తెలియనే తెలియదు. కాబట్టి లేని ప్రమాదాన్ని ఊహించుకుని, లేని శత్రుత్వాన్ని కల్పించుకుని వాళ్ళనెందుకు చంపాలి?" అన్నాడు.

రాజకుమారులు అతడి మాటలు విన్నాక తాము నోరు జారినందుకు సిగ్గు పడ్డారు. అచిరకాలంలోనే చంద్రమతీ, వీరసేనుల వివాహం అత్యంత వైభవంగా జరిగింది. ఆ వివాహానికి వచ్చిన ఘోరక దంపతులు ప్రపంచ శాంతి కోసం కృషిచేసే మహాపురుషులందరికీ తాము సాయం చేయగలమని మాట ఇచ్చి వెళ్ళారు.






# మానవత్వంలో తేడాలు

విక్రమపుర రాజు ఆకస్మికంగా చనిపోవటంతో చిన్నతనంలోనే యువరాజుకు రాజ్యాభిషేకం జరిగింది. లోకానుభవం లేని ఆ కొత్త రాజుతో రాజగురువు, "రాజ్యపాలన చేసేవాడికి మనుషులలో మానవత్వం ఎంత పాలున్నదీ తెలియటంఅవసరం. ఆ సంగతి నాకు అవకాశం దొరికినప్పుడల్లా వివరించి చెబుతూ ఉంటాను, గ్రహించుతూ ఉండు," అన్నాడు.

"అది తెలుసుకోవటం ఎంత కాలం పడుతుంది?" అని రాజు అడిగాడు.

"శ్రద్ధగా మనుషుల ప్రవర్తనను పరిశీలిస్తూపోతే ఎంతోకాలం పట్టదు," అన్నాడు రాజగురువు. తన కొలువులో ఉండేవాళ్ళు తమకు కలిగే అనుభవాలను తనకు చెప్పేటట్టు రాజు ఏర్పాటుచేశాడు. ఒకసారి రాజుగారి చారుడొకడు వచ్చి ఇలా చెప్పాడు:

"మహారాజా, అడవిదారిలో నడుస్తూండగా, నాకాలిలో ముల్లు విరిగింది. నేను కుంటుతూ నడుస్తూండగా ఒకడు పరిగెత్తుకుంటూ వచ్చి, 'పులి వస్తున్నది తప్పుకో!' అని హెచ్చరించి, ఒక చెట్టెక్కాడు. నేను మరో చెట్టు ఎక్కాను. కొంచెంసేపటికి పులి ఆ దారినే వెళ్ళిపోయింది. తరవాత ఇద్దరమూ చెట్లు దిగి, ఎవరి దారిన వాళ్ళం వెళ్లాం."

"ఆ మనిషిదగ్గర ఆయుధాలు ఉన్నాయా?" అని రాజగురువు అడిగాడు.

"ఉన్నాయండి. మనిషి కూడా చాలా ధాటీగా ఉన్నాడు," అన్నాడు చారుడు.

తరవాత రాజగురువు రాజుతో, "చారుడు చెప్పిన మనిషిలో మానవత్వం నాలుగోవంతున్నది. పులి వస్తున్నదని హెచ్చరించాడుగాని, అవతలి మనిషిని రక్షించే ప్రయత్నం మాట ఆలోచించలేదు; తన రక్షణ తాను చూసుకున్నాడు," అన్నాడు.

మరొకసారి మరొక చారుడు ఇంకొక సంఘటన గురించి చెప్పాడు.

25-ఏళ్ళనాటి చందమామ కథ



ఒక దిక్కులేని పేదమనిషి తిండిలేక నీరసించి, ఒక ధనికుడి ఇంటి ముందు మూర్ఛపోయాడు. ధనికుడా మనిషికి తిండి పెట్టి, తన నౌకరుగా ఉంచుకున్నాడు. ఒక నాడు ఆ ధనికుడు నౌకరును చావగొట్టు తూంటే ఆ దారిన వెళ్ళే మనిషి ఒకడు ఆగి, "ఎందుకు వాణ్ణి అలా కొడుతున్నావు?" అని అడిగాడు.

"శోష వచ్చి పడిపోయినప్పుడు వీడికి తిండిపెట్టి, వీడు నాకు బతికున్నంతకాలమూ సేవకుడుగా ఉండేటట్టు పత్రం రాయించు కున్నాను. నాకు అమ్ముడుపోయినవాణ్ణి నా ఇష్టం వచ్చినట్టు చేస్తాను," అన్నాడు ధనికుడు.

దారే పొయ్యేవాడు ఆ పత్రం తెప్పించి చూసి, చించి అవతల పడేసి, పేదవాడితో, "నీ దాస్యం ముగిసింది. ఇక నీ ఇష్టం వచ్చి నట్టు తిరుగు," అని చెప్పి, తన దారిన వెళ్ళి పోయాడు.

"ఆ దారేపొయ్యేవాడిలో మానవత్వం సగ పాలున్నది. అంతకన్న హెచ్చు ఉంటే, ఆ పేదవాడి భవిష్యత్తు గురించి ఏదైనా చేసే వాడు. వాణ్ణి మరొకరు కొనవచ్చు," అన్నాడు రాజగురువు.

"ధనికుడి మాట ఏమిటి?" అని రాజు అడిగాడు.

"వాడిలో మానవత్వం ఏమాత్రమూ లేదు. వాడు నరరూప పశువు," అన్నాడు రాజగురువు.

ఒకనాడు రాజసభకు ఇద్దరు వర్తకులు చాలా దైన్యస్థితిలో వచ్చారు. వాళ్ళు విలువగల వస్తువులతో ప్రయాణం చేస్తూండగా దారిలో దొంగలు అటకాయించి, వాళ్ళ వస్తువులన్నీ లాక్కుని, వాళ్ళను చంపటానికి కత్తులెత్తా రట. అప్పుడు వాళ్ళ నాయకుడు వాళ్ళను వారించి, "వెధవల్లారా, ఇలాంటివాళ్ళనుచం పుతూ పోతే మనం ఎవరిని దోచుకుంటాం? మన వృత్తి ఎలా సాగుతుంది?" అని తమకు దారిఖర్చులకు గాను చెరి రెండు రూపాయలూ ఇచ్చాడని ఆ వర్తకులు చెప్పారు.

"దొంగల నాయకుడిలో ముక్కాలు వంతు మానవత్వం ఉంది. వాడి వృత్తే వాణ్ణి పరిపూర్ణ మానవుడు కాకుండా చేస్తున్నది," అన్నాడు రాజగురువు.

ఒకరోజు రాజభటుడు ఒకడు ఇద్దరిని రాజుగారి ఎదుటికి తెచ్చాడు. వారిలో ఒకడు ధనికుడు, రెండోవాడు బీదవాడు.

"మహారాజా, ఈ బీదవాణ్ణి ఈ పెద్దమనిషి నీటిలోకి తోసి, తానూ పడ్డాడు. ఇది నేను కళ్ళారా చూశాను. నేను దగ్గిరికి వచ్చేసరికి ఇద్దరూ ఒడ్డుకు చేరుకున్నారు," అన్నాడు భటుడు.

"ఆ మనిషిని నదిలోకి ఎందుకు తోశావు?" అని రాజు ధనికుణ్ణి అడిగాడు.

దానికి ధనికుడిలా చెప్పాడు:

"మహారాజా, నేనీ మనిషికి ఇంకా చాలా ద్రోహాలు చేశాను. అన్నీ చెబుతాను, చిత్తగించండి. ఇతను నా పొరుగునే ఉంటాడు. బీదవాడూ, అసహాయుడూ అని అతని స్థలం చాలా దురాక్రమణ చేసి కాజేశాను. ఇతను నా దుర్మార్గం గురించి అందరికీ చెబుతూ వచ్చాడు. నా పరువు తీస్తున్నాడని ఇతని ఇంటికి నిప్పు పెట్టించాను. దాన్ని గురించి విచారణ జరిగితే, అతని అజాగ్రత్త వల్లనే ఇల్లు కాలిందని లోకాన్ని నమ్మించాను. అతను తిరిగి ఇల్లు కట్టుకోలేకపోయాడు. ఇవాళ నదీతీరాన నాకు తారసిల్లి, 'నన్ను సర్వనాశనం చేశావే!' అన్నాడు. నాకు కోపం వచ్చి అతన్ని నదిలోకి తోశాను. అతను నన్ను పట్టుకోవటం చేత నేను కూడా అతనితోపాటు నదిలో పడ్డాను. నేను ఈత రాక మునిగిపోతూ ఉండగా అతనే నన్ను కాపాడి ఒడ్డున చేర్చి, తాగిన నీరు కక్కించి రక్షించాడు."

రాజగురువు సలహాపై రాజు బీదవాడికి ధనికుడి చేత నష్టపరిహారం ఇప్పించి, మరే శిక్షా విధించక పంపేశాడు.

తరవాత రాజగురువు రాజుతో, "చూశావా, నాయనా? ఆ బీదవాడు సంపూర్ణ మానవుడు. అందుచేతనే అతను ధనికుడి స్వభావాన్ని సైతం మార్చగలిగాడు. సంపూర్ణ మానవుడు కానివాడు ఇతరుల స్వభావాలను మార్చి వారిలో మానవత్వం కలిగించలేడు," అని చెప్పాడు.

రాజగురువు చేసిన బోధలతో రాజుకు మానవత్వం ఎలా ఉండేదీ అర్థమయింది. అతడు దేశాన్ని చక్కగా పరిపాలించాడు.



# ప్రకృతి వింతలు :

## అరుదైన చిలుక




చిలుకలలో 'హీరామన్ టొటా' అనే జాతి చిలుకలు చాలా అరుదైనవి. వీటి కంఠస్వరం చాలా శ్రావ్యంగా వుంటుంది. మనుషులు మాట్లేడే భాషను ఇవి ఇట్టే అనుకరిస్తాయి. మొగల్ చక్రవర్తి హుమయూన్, బహదూర్‌షా నుంచి గాగ్రాన్ కోటను పట్టుకున్నప్పుడు, అక్కడి బంగారుపంజరంలోని ఒక చిలుక కూడా ఆయన వశమయింది. దానికేసి వింతగా చూస్తూన్న హుమయూన్ దగ్గరికి, బహదూర్‌షాను వదిలి వెళ్ళిన రూమీఖాన్ రాగానే హీరామన్ 'గద్దర్, గద్దర్' (ద్రోహి) అని పలికిందట! సుప్రసిద్ధ పక్షి శాస్త్రజ్ఞుడు డా॥ సలీంఅలీ ఈ చిలుకలు చాలా త్వరగా మాటలు నేర్చుకుంటాయని తెలియజేశాడు. దురదృష్ట వశాత్తు ఈ జాతి చిలుకలు నశించిపోయే స్థితికి వచ్చాయి. మధ్యప్రదేశ్ కోటల చుట్టూ నివసిస్తూన్న బెహీడియా తెగవాళ్ళు ఈ చిలుకలను చూడగానే వలలు విసిరి పట్టే స్తున్నారు!

## బంగారు రంగు కోతి




ఇరవై సంవత్సరాల తరవాత పశ్చిమబెంగాల్, జల్పాయ్‌గురి సమీప వోల్కా గ్రామంలో బంగారు రంగు కోతి (గోల్డన్ లాంగూర్) కనిపించింది. దానిని చూడగానే 'బక్సాటైగర్ ప్రాజెక్టు'కు చెందిన వాళ్ళు, పట్టుకుని అస్సాంలోవున్న మానస్ జంతుసంరక్షణాలయానికి చేర్చారు. త్వరగా నశించి పోతూన్న జంతువులలో ఇది కూడా ఒకటి!

## ఆకలి చావులు!




బ్రిటిష్ దీవులలోని దాదాపు 75,000 సముద్ర పక్షులు ఆకలితో చనిపోయినట్టు తెలుస్తున్నది. బ్రిటిష్ దీవుల తూర్పు తీరంలో నివసిస్తున్నవాళ్ళు సముద్రంలోని చేపలన్నిటినీ పట్టి వేయడంవల్ల, ఈ పక్షులకు చేపలు కరువవుతున్నాయి. షెట్‌లాండ్స్‌లో మాత్రం 50,000 పక్షులు మరణించినట్టు తెలిసింది. వీటిలో గ్యుల్‌మోట్, షాన్స్, ర్యాజర్ బిల్స్, పఫిన్స్ మొదలైన పక్షుల సంఖ్య మరీ తగ్గిపోయాయి!

# జామెట్రీతో సరదా యిదే-గీసే ప్రతి కోణం అమోఘం, ప్రతి రేఖా ఖచ్చితం!






మీకోసం కోరస్
నక్సెస్ జామెట్రీ సెట్ తెచ్చుకోండి.
దీని నిశితమైన వరికరాలు ఏళ్ళకేళ్ళుగా
బాగా పనిచేస్తాయి. అన్నింటికన్నా
మెరుగైనదే తీసుకోండి. కోరస్ వారి నక్సెస్.
కోరస్ వారి మరొక శ్రేష్ఠమైన ఉత్పాదన:
ఎలెగెంట్ జామెట్రీ సెట్.

ABCDEFGHIJKLM
NOPQRSTUVWXYZ
abcdefghijklmnopqrst
uvwxyz 1234567890

ఉచితం!*
అక్షరాల స్టెన్సిల్
లోపలవుంది.

**కోరస్**

కోరస్ (ఇండియా) లిమిటెడ్, బొంబాయి 400 018
భారత దేశంలో అన్నిచోట్లా బ్రాంచీలున్నాయి

AKA/590-TL-R

* స్టాకులు ఉన్నంతవరకూ.

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1994 ఆగస్టు నెల సంచికలో ప్రకటింపబడును.



Shanbagavalli



Sundaramurthy

*పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * జూన్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. *మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. *వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : కదిలిస్తే కథలెన్నో... రెండవ ఫోటో : కనుల నిండ కలలెన్నో!

పంపినవారు : కె.పి. దైవశిఖామణి, సూపర్నెంటు ఫైనాన్స్ –
డి. యమ్స్ ఆఫీస్, ఏ.పి.ఎస్.ఆర్.టి.సి, శ్రీకాళహస్తి, చిత్తూరు జిల్లా (ఆం. ప్ర)
బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 48.00
చందా పంపవలసిన చిరునామా :
డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


Parle-G
PARLE
BISCUITS